శ్రియైనమః

శ్రీవిఖనస మహాగురవే నమః

శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రే

భగవన్మరీచి మహర్షిప్రోక్తా

# ఆనన్ద సంహితా

శ్రీమద్భిర్వైయ్యాకరణ పంచాననైః

రొంపిచర్ల భట్టర్, పార్థసారథి కృష్ణమాచార్యైర్విరచితయా

సంస్కృత వ్యాఖ్యయా సాంద్రతాత్పర్యయా

సముపస్కృతా




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1998

# ANANDA SAMHITA

by

**Maharshi Marichi**

TTD Religious Publication Series No. 509
T.T.D. First Edition 1998
Copies : 500




Published by :
**Sri. M.K.R. Vinayak,** I.A.S.
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati.




Printed at
***PRABHALA Hi-tech Enterprises Pvt. Ltd.***
*8-6-53, 5th Line, Nehrunagar, Guntur - 522 001*
Ph. : 323960 Fax.: (0863) 356705

# ముందు మాట

"ఆనంద సంహితా"- అనే ఈ సంస్కృత గ్రంథం శ్రీ విఖనో మునీంద్రుల అంతరంగ శిష్యుల్లో ఒకరైన మరీచిమహర్షిచే రచింపబడింది. ఇందులో మొత్తం యిరవై అధ్యాయాలు ఉన్నాయి.

శ్రీ మహావిష్ణువు పరతత్త్వమనే నిర్ణయము, విష్ణుమూర్తిని అర్చించే విధానాలు, వైఖానస అర్చకుల ఆచార వ్యవహారాలు, శ్రీ విఖనస మహర్షి అవతార వైభవము - మున్నగు ముఖ్యాంశాలు ఈ గ్రంథంలో వివరించబడ్డాయి. ఇందలి విషయాలు సుబోధకమయ్యే లాగున కీ. శే. శ్రీ రొంపిచర్ల భట్టర్ పార్థసారథి కృష్ణమాచార్యులు గారు సంస్కృతంలో వ్యాఖ్యను, తెలుగున తాత్పర్యాన్ని రచించారు. ఈ గ్రంథం శ్రీ వైఖానస గ్రంథమాల (ఈగావారి పాళెం) వారిచే 1924 - 1925 సంవత్సరాల్లో ముద్రింపబడింది.

అలభ్యమైన ఈ ఆగమ గ్రంథాన్ని ప్రచురించడంలో సహకరించిన శ్రీ మాడంబాకం కృష్ణస్వామి శ్రీనివాస భట్టాచార్యులు (తి.తి.దే. ఆస్థాన పండితులు) గారికి, శ్రీ వైఖానస దివ్య సిద్ధాంత వివర్ధినీ సభ వారికి కృతజ్ఞతలు.

**M.K.R. Vinayak, I.A.S.**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానము

తిరుపతి
27–11-97

# ప్రస్తావన

ఆనన్దసంహిత అను నీ గ్రంథము మహర్షి మరీచి ప్రణీతము. దీనిని 1925 సంవత్సరములో శ్రీవైఖానస గ్రంథమాల, ఈగావారిపాలెం వారు ప్రచురించిరి. దీనికి కీ॥ శే॥ వైయ్యాకరణ పంచానన రొంపిచర్ల భట్టర్ పార్థ సారథి కృష్ణమాచార్యులు గారు సంస్కృత వ్యాఖ్యయూ, ఆంధ్ర తాత్పర్యమును వ్రాసి మహోపకారము గావించిరి. వారు వ్రాసిన గ్రంథ ప్రవేశములో వివరములు యిచ్చిరి.

ఈ గ్రంథములో ముఖ్యముగా వైఖానసమహిమ, విఖనసోత్పత్తి, అర్చావతార విచారము, గర్భచక్రాంకిత విశిష్టత, విఖనసస్తోత్రాదులు గలవు.

ఈ గ్రంథము చివరలో ఆనందసంహితయందు ఉపోద్ఘాత భాగమను ప్రథమ భాగము సంపూర్ణము అని వ్రాయబడినది. శ్రీ మరీచి మహర్షి వ్రాసిన విమానార్చనకల్పము అను గ్రంథమునకు ఆనంద సంహిత అని పేరు కూడా వాడుకలో యుండుటచే ఈ గ్రంథమును దానికి ఉపోద్ఘాత భాగముగా గ్రహించియుండవచ్చును. ఈ పుస్తకము శ్లోకరూపములోను, విమానార్చన కల్పము గద్యాత్మకముగాను గలవు. ఈ రెండునూ మహర్షి మరీచి ప్రణీతములే అయివున్నవి.

ఈ గ్రంథములో అచ్చుటచ్చుట + గుర్తులు x గుర్తులు వున్నచోట ఆ శ్లోకము యొక్క పాదములుప్తమైనట్లున్నది. వాటిని పూరించుటకు వ్రాత ప్రతులు లభ్యము కానందున అవి అట్లే తిరిగి ముద్రించబడినవి. కొన్ని శ్లోకములకు అర్ధ (సగము) శ్లోకముగా నంబర్లుయీయబడినవి. వాటిని సులభముగా తెలియుటకు అర్ధగుర్తు వేయలేదు. ఈగావారి పాలెంవారు ముద్రించిన గ్రంథమును మాతృకగా స్వీకరించి పురనర్ముద్రణ గావించబడినది.

ఈ పునర్ముద్రణకుగాను నిరంతర కృషిని పట్టుదలతో గావించిన శ్రీ దీవి విఖనసాచార్యులుగారు కార్యదర్శి, శ్రీ వైఖానస దివ్యసిద్ధాన్తవివర్ధినీ సభ తిరుమల వారికి, ప్రూఫులు చూచుటలో సహకరించిన శ్రీ పెద్దింటి వేంకట సూర్యసీతారామ జగన్నాథాచార్యులు (ఎ.రాంబాబు) ద్వారకా తిరుమల, మరియు శ్రీ దీవి శ్రీనివాసదీక్షితులు, శ్రీ గంజాం ప్రభాకరా చార్యులు, తిరుమల వార్లకు శుభాశీస్సులు.

ఆర్ష గ్రంథములు అచ్చువేయవలెనని ధృఢసంకల్పముతో వీటిని చేబట్టిన కార్యదీక్షాదురంధరులు శ్రీ యమ్.కె.ఆర్. వినాయక్, ఐ.ఏ.ఎస్. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, దేవస్థాన పరిపాలనమండలికి, శ్రీ యన్. యస్. శ్రీరామమూర్తి, ఎడిటరు, టి.టి.డి గారికి నా నమస్సుమాంజలులు.

గ్రంథముద్రణను చక్కగా శ్రద్ధతో చేసిన ప్రభలహైటెక్ అధినేత శ్రీ కిషోర్ ప్రభల, గుంటూరు గారికి ఆశీస్సులు.

శ్రీ వైఖానస శాస్త్రమును గురించియూ, శ్రీ విఖనసమునిని గురించియూ, అర్చావతార విశిష్టతను గురించియూ తెలుసుకొనుటకు ఈ గ్రంథము ఎంతో ఉపయోగపడును.

తిరుమల
15 - 1 - 1998.

సజ్జన విధేయుడు
*మాడంబాకం కృష్ణస్వామి శ్రీనివాస భట్టాచార్య*
తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన పండితులు.

విఖనసాచార్య పటము



(భృగుః) (అత్రిః) (విఖనసాచార్యః) (కాశ్యపః) (మరీచిః)

# గ్రంథ పరిచయము

ఈ యుపోద్ఘాత భాగమునందలి ప్రథమసంచికను వెలిబరచు సందర్భముననేనీ యంశమును వ్రాయునవకాశము గల్గి సారాంశమునప్పుడె యచ్చట జెప్పియుంటిని గాన యిందా వివరము జేర్చుట పునరుక్తమని విడచితిని. ఆ వివరమును గూడ పైపుటయందు కనదగును.

అతి విస్తృతమగు నీసంహితయందుపోద్ఘాత ప్రాయమగు నీ భాగమునకు మాత్రము గీర్వాణాంధ్రములందు స్వల్పమగు వివరణమును వ్రాసి ప్రచురించుట యావశ్యకమని పలువురు నన్ను నియమించినందున నేనందులకై యత్నించి యట్లే యొనర్చితిని. ముందు చెప్పబడు ప్రక్రియా భాగము తెనుగు తాత్పర్యము జేర్ప నవగాశముగాని యావశ్యకతగాని గలుగని దగుటచే విషమస్థలములందు సంస్కృతటిప్పణముతో జేర్చి ప్రత్యేక సంచికలుగ ముద్రించుట యుక్తమనితోచి యీవత్సరాంతముతో నీభాగము ముగింపబడినది. దీని నుపోద్ఘాతప్రాయమగు ప్రథమభాగమని యనదగును.

ఈ గ్రంథమున పలుచోటులందు అనవిధానముచే నచ్చు పొరపాట్లు విశేషముగ బడియుండుట పాఠకలోకమున కుద్వేజకంబని యెరింగియు దీనికొక తప్పొప్పుల పట్టికను చేర్చినచో నదియు నొక్క పుస్తకము కాగలదను భయముచే నా క్లేశము ననివార్యముగ బాఠకమహాశయులకే విడువవలసిన యవసరమేర్పడినందులకు కడుంగడు చింతించుచు నట్టిస్థలములలో తప్పులను జాగరూకతతో సవరించికొనుటకు ప్రార్థించు చున్నాడను.

మరియు మాతండ్రిగారి యవతారకాలంబున నీయమూల్య గ్రంథమును బహుప్రయాసచే సంపాదించి దీనిని ముద్రింపించుటకు మిక్కిలి కుతూహలపడియు నట్టియవకాశము గలుగకనే వారు తమయవతారమును చాలించుటచే వారి మనోరథ మీనాటి కీ తీరున నిర్వర్తింపబడుచుండుట యౌగపద్యంబున దుఃఖానందములకు సమాన స్థానము నిచ్చుచున్నది. కావున నీ గ్రంథమును శ్రీవారి యుపాస్యదైవ తమగు శ్రీకోదండరామచంద్రమూర్తి శ్రీవారి మనోరథ పూర్తికై యనుగ్రహించు గాతయని ప్రార్థించుచున్నాడను.

ఇట్లు
పార్థసారథి

శ్రీరస్తు

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

# గ్రంథ ప్రవేశము

శ్రీరామచంద్రుని యనుగ్రహముచే నేటికీ యానందసంహితను ముద్రింపించి ప్రచురింప నవకాశముగలిగినది. ఈ సంహితను రచియించినది శ్రీవిఖనోమునీంద్రుల యంతరంగ శిష్యులు నలువురలో నొకరగు మరీచి మహర్షియై యున్నారు. ఈ నలువురు మహర్షులును కలసి భగవచ్ఛాస్త్రమును నాల్గులక్షల పరిమితమగు గ్రంథముగ నుపదేశించిరి. ఈ నాల్గు లక్షలలో చాలభాగము కాలవశముచే గలితమై నేటికి కొలది గ్రంథము మాత్ర మచ్చటచ్చట నపురూపముగ సంరక్షించబడుచున్నది. ఈ గ్రంథమునకే సంహితలనియు, తంత్రములనియు, కాండములనియు, కల్పములనియు, వ్యవహారము గలిగియున్నది. ఇట్లు పలు తెరంగులగు నీ శాస్త్రమంతయు సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుని యర్చనవిధానమునే వివరించుచున్నది. ఒక్కొక్క సంహితయునిట్లే యొక్కొక్క కాండము, తంత్రము, కల్పము భగవద్యజనమునునొకే యంశమును ప్రతిపాదించినను ఒక గ్రంథమునందు సంక్షేపముగ జెప్పబడిన యంశమును వేరొక గ్రంథమునందు విస్తరంచి యుపన్యసింపబడుటచే గ్రంథములన్నియు పునరుక్త దోషదుష్టములుగాక సార్థకములై వెలయుచున్నవి. అదేవిధముగ నీయానందసంహిత యందు తక్కిన సంహితలలో సంక్షేపముగ జెప్పబడిన గర్భ చక్రాంకణ సంస్కారము విశేషముగ ప్రకటించబడియున్నది. మహర్షుల వాక్యములు మిక్కిలి గంభీరములై యొప్పుచున్నందున 'నైకానాప్యక్షరేణానర్థకేన భవితవ్య' మని భగవత్పతంజలి మహర్షి శాసించిన చందమున గ్రంథమందలి యొక్కొక్క యక్షరముగూడ యనర్థముగాక సార్థకమే కావలసియుండుటచే ప్రతీయంశమును మిక్కిలి జాగరూకతతో గ్రహించదగియున్నది. మానవాది స్మృతులవలె యాసంహితలును ప్రమాణములనియు సంహితాంతరములయందెందును వివరింపబడని విష్ణు ప్రతిష్ఠోత్సవాదులనే యీస్మృతులు వివరించుటంజేసి స్మృతులలో నియ్యావి యొక విలక్షణమగు నుత్తమకక్షలో జేరుచున్నవనియు శాస్త్రకారుల మతమైయున్నది.

ఈ శాస్త్రము, విష్ణువు పరతత్త్వమనియు, అతడొక్కడనియు, జీవులనంతములగు మరియొక తత్త్వమనియు, వీరలలో ననాదియగు నవిద్యచేయావరింపబడిన జీవులు భగవానుని

యనుగ్రహముచే ముక్తి (యనగా భగవత్సాన్నిధ్యమును) జెందుదురనియు ప్రపంచరూపమున బరిణమించెడి పలువిధవికారములను గలుగజేయునది. ప్రకృతియను నొక ప్రత్యేక తత్త్వమనియు, నిదిసత్త్వరజోస్తమోగుణాత్మక మనియు, జీవప్రకృతులు రెండును పరతత్త్వమగు నారాయణుని యధీనమున నుండుననియు శాసించు చున్నది. ఇదియే శాస్త్రము యొక్క పరమ తాత్పర్యము.

అపారమగు నీభగవచ్ఛాస్త్రమును సాకల్యముగ నధ్యయనముజేసిన మహనీయులచే జేయదగిన యీసంశోధన భారమును నావంటి యల్పజ్ఞుడను పైదీసికొనుట మిక్కిలి పరిహాసాస్పదమైనను శ్రీమదాచార్య కటాక్షమును నమ్మి గ్రంథసేవా కుతూహలముచే సాహసించినందులకు విద్వన్మహాశయులు మన్నించి నాపరిశ్రమమును సఫలముచేయుదురు గాక యని ప్రార్థించు చున్నాను.

మూలగ్రంథ శోధనమునందు నాకు సాయపడిన శ్రీకోశములు.

1. మా తండ్రిగారగు శ్రీశ్రీశ్రీ కోదండరామాచార్య పాకయాజుల వారు తమ వివిధ దేశసంచారమున సేకరించి యుంచిన శ్రీ వైఖానస విద్యా నిలయ పుస్తక భాండాగారమందలి తాళపత్రశ్రీకోశము. ఇదిచాలా వరకు శుద్ధమైయున్నది. ఆంధ్రాక్షరములు.

2. మదరాస్ ఓరియంటల్ లైబ్రరీలోని ప్రాచీనశ్రీకోశము. అసమగ్రము.

3. నాచ్చియార్‌కోయిల్ విద్వాన్ కృష్ణభట్టాచార్యులవారి శ్రీకోశము. ఇదియు శ్రీయాజులవారి శ్రీకోశము ననుసరించియే యున్నది. ఇదియు అసమగ్రముగనేయున్నది. ఈ రెండును గ్రంథాక్షరములు.

4. తిరువహీంద్రపురం శ్రీమాన్ అర్చకం నీలమేఘ భట్టాచార్యుల వారి శ్రీకోశము. ఇది శ్రీయాజులవారు పశ్చిమదేశ సంచారమున సంపాదించిన ప్రతికి పుత్రికయైయున్నది. ఆంధ్రాక్షరములు అసమగ్రము, మరియు యీశ్రీకోశము ప్రతివైఖానసుల యింటనుండుటచే మరి యనేక గ్రంథములను సేవించితిని. వ్యాఖ్యానమును తాత్పర్యమును వ్రాయుట యందింకను విద్యానిలయ పుస్తకభాండాగారము నందలి యితర శ్రీకోశములన్నియు నాకు సాయపడినవి.

శ్రీ వైఖానస విద్యానిలయము ఇట్లు

# విషయసూచిక

శ్రియైనమః
శ్రీశ్రీనివాస పరబ్రహ్మణేనమః
శ్రీమద్విఖనస మహాగురవే నమః

శ్రీవైఖానసీయా

# మరీచిప్రోక్తా ఆనన్దసంహితా

## ప్రథమోఽధ్యాయః

## విష్ణుపారమ్యమ్

శ్లో. శ్రౌతస్మార్తాత్మికం కర్మ నిఖిలం యేన సూత్రితం
తస్మై సమస్తవేదార విదే విఖనసే నమః
నారాయణః పితా యస్య యస్య మాతా హరిప్రియా
భృగ్వాదిమునయః పుత్రా స్తస్మైవిఖనసే నమః

## వ్యాఖ్యాన ప్రారంభః

జయత్యాత్మేశ్వరోన్నిద్రధ్యానసౌధ ప్రియాతిధిః
శ్రీమ త్పత్రపురీవాస శ్శ్రీరామ స్సీతయా గృహీ

అథ తత్రభవాన్మరీచి రధిగమ్య భగవచ్ఛాస్త్రం భగవతో విఖనస్సకాశాత్ప్రాణినాయ లోకాననుజిఘృక్షు ర్బహ్వ్యస్సంహితా స్తాస్వియమానన్దసంహితాభిధా ప్రచురప్రచారా. సంహితా స్త్వేతా ధర్మశాస్త్రత్వేన ప్రమాణపథ మధిరోహన్తీతి న్యాయవిదాం మతం. అథ గ్రంథ మవతారయతి మరీచిమితి. బ్రహ్మణో విఖనస శ్చాక్షుషం చ క్షుర్భవం సుతం మరీచిం తన్నామ్నాప్రసిద్ధం మునిలోకేశం జీవపరయోర్భేదం జానాతీతి తాదృశం, సాపేక్షత్వా త్సమానః ప్రభోర్గురోశ్శిష్య మధ్యయన కాలికోయం గురుశిష్యభావ స్సంబంధ ఇతి న పునరుక్తిః. మహాత్మానం సువ్రతా దయో మునయోభిగమ్య తత్రాభిగమనప్రస్తావో యథా ముండ కోపనిషది "పరీక్ష్యలోకాన్ కర్మ చితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాన్నా స్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం న గురుమేవాభి గచ్ఛే త్సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠ," మితి అనేన మహర్షీణాం నిర్విణ్ణానాం తత్త్వజిజ్ఞాసా, మరీచే స్తత్త్వవిత్త్వం సంశయచ్ఛేత్తృత్వంచ

తాత్పర్యము:- బ్రహ్మయొక్క చక్షుస్సునుండి యుత్పన్నమైనట్టియు మునిలోకాధిపతియైనట్టియు జీవపరుల భేదము నెరిగినట్టియు ప్రభువగు విఖనసుని శిష్యుడును మహాత్ముడును అయినట్టియు మరీచి మహర్షిని గూర్చి- సువ్రతుడాదిగాగల మునులు నిర్విణ్ణమానసులైపోయి యథోచితముగా నమస్కరించి యీదిగువ ప్రకారము ప్రశ్నించిరి. 2. షడ్గుణైశ్వర్య పరిపూర్ణుడను అశేష

మరీచిం మునిలోకేశం బ్రహ్మాణ శ్చాక్షుషం సుతం
భేదజ్ఞం జీవపరయోశ్శిష్యం విఖనసః ప్రభోః 1
అభిగమ్య మహాత్మానం మునయ స్సువ్రతాదయః
ప్రణీపత్య యథాన్యాయ్య మిదం వచన మబ్రువన్ 2

వ్యంజ్యతె. ఏవమాదయ ఏవార్థా ఉత్తరత్ర శబ్దత ఏవోచ్యన్తే అత ఇదం వక్ష్యమాణం వచనం ప్రశ్నం అబ్రువన్నపృచ్ఛన్. అత్రమా మిత్యధ్యాహృత్యేదం మరీచివాక్య మథవా ధ్యేత్పూణామితి భావ్యం. 2. ప్రశ్నప్రకార మాహ భగవన్నితి. భగవన్నిత్యాదీని సంబుద్ధ్యం తాని పంచ. విశ్వహితోద్యత ఇతి ప్రథమాంతం, అథవా విశ్వహితోయత ఇతి పాఠః, ఉభయత్ర త్వమసీతి శబ్దద్వయ మధ్యాహార్యం యతస్త్వ ముక్త లక్షణ స్తస్మాత్త్వా మేవా స్మాకం గురుంవృత్వా సర్వేవయ మాత్మహితం పరం పృచ్ఛామః. ధర్మమితి శేషః. అథవా ఆత్మహితం పరమితి త్వచ్ఛబ్ద విశేషణం. 3. అథ ప్రశ్న శరీరమాహ శ్రుతయఇతి. వివిధాభిర్విభిన్న ప్రక్రమైరుక్తాఅర్థాస్తత్త్వాని యాభిస్తాదృశ్యశ్శ్రుతయః తథా విధాన్యేవస్త్రాణిచ, తర్క్యత అస్మిన్నితి తర్కశ్శాస్త్రాణి తేషాం సిద్ధాన్తా అపి బహవో బహువిధాః పూర్వోక్తశాస్త్ర శబ్దస్య యథావస్థితార్థస్వీకారేణ వైవిధ్యోక్తేరస్యచ శాస్త్రజ్ఞై రాచార్యైరుపస్థాపిత సిద్ధాన్తానాం వైవిధ్యోక్తేశ్చన పునరుక్తిః, యస్మాదిత్థం భూతం శబ్దప్రమాణం యతఃప్రమాణాం తరాణి ప్రత్యక్షాదీని తత్త్వనిర్ణయేన స్వతంత్రసాధనాని తస్మాద్వయం కర్తవ్య మూఢా స్సంశయమాగతాః. 4 తతస్సంశయస్వరూప మాహశ్రుతీతి. శ్రుతిస్మృతీతిహాసాద్యై రేకమత్యా ఐకకంఠ్యేనా విరోధేనేతి యావత్. కోదేవ ఉపపాదిత ఇతి. శ్రుత్యాదిష్వేకోదేవో బహుధాసన్నివిష్టః, ఇత్యాదిషు నియమే నైకస్యైవ దేవస్య శబ్దశక్తి స్వభావా త్తృతీయమానత్వా దనేక ప్రభుపాలితత్వ మేకరాష్ట్రస్యేవ యథా ప్రకృతిరాజ్యస్యాపి బహుదేవపరిపాలి తత్త్వమ సంభావీత్యను మానాదేకస్యైవ ప్రభోస్సిద్ధేశ్చ సిద్ధవత్కృత్యైకం దేవం బ్రహ్మ విష్ణు రుద్రేంద్ర సదసదాకాశాది నామభిర్బ్రాయో వ్యవహృతః. కోపావేకోదేవ ఇతి సంశయః. 5. తమేవ సంశయం స్వయం వివృణ్వతే సర్వదేవేశఇతి. కోదేవ ఇత్యత్రాపిసంబధ్యతె, సర్వదేవానా

వేదశాస్త్రార్థ వేత్తయును తత్వజ్ఞుడును జితేంద్రియుడును, బ్రహ్మపుత్రుడను అగువోమహాత్మా నీవు జగత్తునకు హితము చేయగల సమర్థుడవు. కావున నాత్మహితమగు పరమధర్మమును తెలిసికొనగోరి నిన్ను మేము ప్రార్థించు చున్నారము. 3. వేదములనేక విధములగు నర్థములను చెప్పుచున్నవి. శాస్త్రములును వివిధములు పూర్వాచార్యులు నిబంధనము చేసిన సిద్ధాన్త ములను అట్లే బహువిధములుగ నున్నవి. ఆ కారణముచే నే ధర్మము ననుష్టించవలయునోయను సంశయము కలిగియున్నారము. శ్రుతి స్మృతీతి హాసాదులచేత నేకగ్రీవముగ కొనియాడబడిన యొక్కడైన దేవుడెవ్వడు.

మునయః

భగవన్విదితా శేష వేదశాస్త్రార్థ తత్త్వవిత్

జిత సర్వేంద్రియ బ్రహ్మపుత్ర విశ్వహితోద్యతః 3

తస్మాత్త్వామేవ పృచ్ఛామో వయమాత్మహితం పరం 3½

శ్రుతయో వివిధోక్తార్థాః శాస్త్రాణి వివిధానిచ

బహవస్తర్క సిద్ధాన్తాస్తస్మాత్సంశయమాగతాః 4

మీశః కోదేవః, కశ్చవేదై రుపనిషద్భిశ్చేరితః, వేదోపనిషదోదిత ఇతిపాఠే వేదాశ్చోపనిషదశ్చ వేదోపనిషదమితి సమాసాన్త ప్రత్యయేణరూపంబోధ్యం. ఉదిత ఇత్యుక్తః, సత్త్వాది లక్షణ ఇత్యాదీని పంచప్రథమాంతాని అత్రాపి కో దేవఇతి సంబధ్యతె. సిద్ధస్యాస్యార్చనంకథం, తస్మిన్నవ్యర్చనే యుగేషు త్రిషు భేదఃకః అవరశ్చతర్ద యుగార్చనంచకథం, పునస్తదేవార్చనం విభజ్యద్విధా శంకతే కథమితి స్వార్థం పరార్థంచ కథంప్రకారాన్తరేణ పునర్విభజ్యశంకతె సకలమితి సకలంకథం, అనేన నిష్కలమపి సంగృహీతం భవతి. ఇదముపలక్షణం సౌమ్యాగ్నేయాది విభాగానాం, వాస్త్వాదీనా మాలయాదీనాం భేదై రేషామర్చనాదీనాం కల్పనంకీదృక్. అత్రాదిశబ్దేనాధి కార్యదీనాం సంగ్రహః ఆలయాది విభేదశ్చేతి పాఠే స్పష్టోర్థః, బహుమూర్తిభి రవతారైశ్చ యుక్తానా మేషాం ధృవాదీనాం రూపం మానం ప్రమాణం చ కింరూపం ఇతి యదస్మాభిః పరిపృష్టం హే వదతాం వర ! ఉపదేశకుశల ఇతిసంబుద్ధిః, సర్వం తదవిశేషీణ కృత్స్నశః సదనుగ్రహతత్పరస్త్వం వక్తుం అర్హసి. 9. ఇతి శిష్యైః పృష్టోమునిర్మరీచిఃప్రత్యువాచ సమాదధే. హేఇతి సౌలభ్యసూచిత మాశ్చర్యంవ్యనక్తి 9. ఏతావతా గ్రంథేనాను బంధచతుష్టయం సుష్టువ్యాఖ్యాతం. జిజ్ఞాసుర్నిర్వేదమా పన్నోऽధికారీ, అర్చనావిషయః ప్రయోజన మైహలౌకికం పారత్రికంచ సుఖం, సంబంధః ప్రతిపాద్య ప్రతిపాదకభావిత్యత్తత్రాప్యనువర్తత ఏతత్. విష్ణుపారమ్య మిత్యయంనగ్రంథగతఇతిభాతి. పరమస్య భావః పారమ్యం విష్ణోఃపారమ్యమితి, త్రమీశ్వరాణాం పరమం మహేశ్వరం తందేవతానాం పరమంచ దైవతమ్ ఇతి శ్వేతాశ్వతరోపనిషద్వాక్య ప్రకృతిమిదం భాతి తత్రాన్యాం శ్రుతిం ప్రమాణయతిపతిమితి. విశ్వస్యపతి మాత్మేశ్వరం శివం మంగళప్రద మచ్యుతమిమాని ద్వితీయాంతాని పదాని, నారాయణోప నిషద్వాక్యస్యానుకరణా

యెవ్వడు సర్వదేవతలకు ప్రభువు. వేదములచేతను వేదాన్తముల చేతను ప్రశంసించబడువాడెవ్వడు. సత్త్వాదిగుణములే లక్షణములు గాగలవాడును, అవ్యక్తుడును, సర్వాత్మకుడును, నిర్గుణుడును, అవ్యయుడును అగు వాడెవ్వడు, అట్లేర్పడిన యాదేవు నర్చించుటయెట్లు ? క్రమముగా కృత త్రేతా ద్వాపర యుగములందును కలియుగమందును ఆయారాధనమునకు భేదమెద్ది? స్వార్థము, పరార్థము అను నర్చనమెట్టిది ? సకల నిష్కలార్చన

శ్రుతిస్మృతీతి హాసాద్యై రేకమత్రోపపాదితః
కోదేవస్సర్వదేవేశో వేదోప నిషదీరితః. 5

సత్వాదిలక్షణోఽవ్యక్తస్సర్వాత్మా నిర్గుణోఽవ్యయః
కథంతస్యార్చనం భేదో యుగేషు త్రిషుకోఽవరః 6

తదర్చనం కథం స్వార్థం పరార్థం సకలం కథం
వాస్త్వాలయాదిభేదైశ్చ కీదృగేషాంచ కల్పనం 7

ద్వితీయాంతతా. నారాయణ పర మిత్యత్ర లుప్తవిసర్గాన్తం నారాయణ పదం. ఛాందసత్వా దనుకరణాద్వేహాపి నవిసర్గస్య శ్రవణం. ఇమానిషట్పదాని, నారాయణః పరఇతి సనాతనీ చిరంతనా శ్రుతిరాహ, సనాతనీతి స్వరూపకథనం, తదర్థద్యోతినీం శ్రుతిముదాహరత్యగ్నిరితి, దేవానామవమఃకనిష్ఠః, యాప్యావమాధమాఇతి కోశః, విష్ణుఃపరమః తదన్తరేణ తయోర్మధ్యే సర్వా అన్యా దేవతాః, ఇదంవాక్యం శ్రీసూత్రకారై ర్నిత్యార్చనప్రకరణే బ్రాహ్మణవాక్యత్వేన సంగృహీతం. సర్వోత్కృష్టోయం తత్తచ్ఛరీరేష్వనుప్రవేశా త్తత్తత్సన్నిహిత తేజస్తారతమ్యా ద్బ్రహ్మ రుద్రాది నామభిస్స్వయమేకఏవ వ్యవహ్రియత ఇత్యాహ, స ఇతి, సబ్రహ్మ యస్మాద్బ్ర హ్మాణ మప్యన్తరోభూత్వాయో యమియతి తస్మాదయం బ్రహ్మేత్యుచ్యతే సశివ స్సేంద్ర స్సోఽక్షరః పూర్వవదేవార్థః పరమస్స్వరాట్ ప్రభుః, స్వయంస్వస్మైపరస్మై చరాజత ఇతి స్వరాట్, అథబ్రహ్మాదీనా మీశ్వరాంశత్వే తేషాం సర్వేషా మప్యవైరూప్యమాశంక్య పరిహరతి ఏకఇతి పుమాన్ పురుషోనారాయణ ఏక ఏవాస్తే. లిజర్థే వర్తమాన ప్రత్యయః. సబ్రహ్మాస చేశ్వరస్స్థితః, బ్రహ్మాదిషు ప్రలీనేషు నష్టేస్థావరజంగమే, ఏకస్తిష్ఠతి విశ్వాత్మానతు

స్వరూపమెద్ది ? అయా గ్రామముల యందును ఆయా ఆలయముల యందును ఈయర్చనమెట్లు చేయవలెను? అనగా గ్రామపత్తనాది భేదముల చే నొప్పెడి ప్రదేశములయందును ఆనందనిలయాది భేదములచే నొప్పు విమానముల యందును ఈ యర్చనమెట్లు చేయవలెను. ఏకమూర్తి మొదలు బహూమూర్తి ప్రతిష్ఠలయందును వ్యూహ విభవాద్యవతార ప్రతిష్ఠల యందును ధృవ కౌతుకాది బింబములకు ప్రమాణమెయ్యది. ఓ గురూత్తమా ఈ ప్రకారమగు మా ప్రార్థనమును పరమ దయాళుడవగు నీవు మర్మముంచక సంశయము లన్నిటిని చెప్పదగియున్నావు. అనియిట్లు మహర్షులచే ప్రశ్నింపబడిన మరీచి మహర్షి వారలకు ప్రత్యుత్తరమిచ్చెను. ఆహా మహాత్ముని సౌలభ్యము 9. దేవతలలో శ్రేష్ఠుడగు దేవుడు హరినారాయణ పరశబ్దములచే వ్యవహరిం పబడుచున్నాడు. ఇందుకు జగత్తునకు పతియు ఆత్మేశ్వరుడును, శాశ్వతుడును, మంగళప్రదుడును,

ధృవాదిబేరమానంకిం బహుమూర్త్యవతారకైః
అస్మాభిః పరిపృష్టం యత్తత్సర్వం వదతాంవర 8

వక్తుమర్హస్యశేషేణ సదనుగ్రహతత్పర,
ఇతిపృష్టోమునిశ్శిష్యైర్మరీచిః ప్రత్యువాచహ 9

నారాయణః ప్రభుః ఇత్యాది కమత్రాను సంధేయం 13. తస్యైవ పరమాత్మనశ్శక్త్యంతరాణి లక్షయతి. అణోరణీయానితి. ఇయంశ్రుతిః, అణోరప్యణీయాన్ మహతశ్చమహీయాన్ తస్మిన్నేవ చహృదయే స్థితః, స్థాస్నువాన్ స్థాస్నురేవ సాస్నువాన్ అథవా స్థాస్నూ చేతనా చేతనేవశేऽస్యా సాత ఇతివార్థః. అభవః జన్మాదిరహితః, ఇతి తస్యలక్షణాన్తరం, విష్ణవేచార్చృత ఇత్యయమనుకరణం శ్రుతేః ప్రవః పాంతమన్దసోధియాయతే, మహేశూరాయ విష్ణ్వచార్చృత ఇతి హి శ్రుతిః, తథా శ్రీసూత్రేచ భగవాన్విఖనా విధత్తే, భగవదారాధన మథాగ్నౌ నిత్యహోమాన్త ఇత్యారభ్య తస్మాద్గృహేపరమంవిష్ణుం ప్రతిష్ఠాప్య సాయంప్రాతర్హోమాన్తే ర్చయతీతి తం యజ్ఞపురుషం ధ్యాయన్ పురుషసూక్తేన సంస్తూయ ప్రణామంకుర్యాత్. యజ్ఞేషు విహీనం తత్సంపూర్ణంభవతి. ద్విజాతిరతంద్రితో

అవ్యయుడును అను మొదలగు శ్రుతిప్రమాణము. నారాయణుడు, పరబ్రహ్మము, పరమాత్మ, పరుడు, అవ్యయడు, అనుశ్రుతియే, నారాయణుడు శ్రేష్టుడు అని చెప్పుచున్నది. ఇంతియేగాక దేవతలందరిలోఅగ్ని కడపటివాడు విష్ణుడెక్కువవాడు, వీరిద్దరి మధ్య యధికారములలో తక్కిన దేవతలందరును చేరుదురు అని శ్రీసూత్రకారులుదహరించిన శ్రుతి ప్రమాణము ఈవిష్ణువే బ్రహ్మరుద్రాదులలో నంతర్యామియై బ్రహ్మరుద్రాది పదములచే పిలువబడుచున్నాడు. ఈతడక్షరుడు స్వయంప్రకాశముగల పరమస్వరూపుడు మరియు నవీశ్వరడగు నీతడొక్కడే త్రికాలముల యందున్నాడు. బ్రహ్మదులు లేరు. 13. ఆపరమాత్మ శబ్దవాచ్యుడగు నారాయణుడు అను పదార్థముల కంటె అణుస్వరూపుడును మహత్ప దార్థముల కంటె మహాత్తును అయియుండి ఆపదార్థములయందే అంతర్యామియై యెవ్వారికి గాని తెలియబడకుండ రహస్యముగానున్నవాడు. మరియు నీతడు నిత్యుడై నిత్యులగుచేతనులను నిత్యమగు ప్రకృతిని తన యధీన మందుంచుకొని యున్నాడు. ఈతడు జన్మరహితుడు. అట్టి విష్ణునర్పించ వలయునని శ్రుతి చెప్పుచున్నది. 14. వేదములయందనేక పేరులచే వ్యవహరింపబడు దేవుడు జనార్దునుడేనని పైకారణముల వలన సిద్ధించినది. హరియే సమస్తమగు జగత్తునకు సృష్టిస్థితి లయములను

## విష్ణుపారమ్యం
### మరీచిః

వేదానాంపరమో దేవో హరిర్నారాయణః పరః 10
పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివమచ్యుతమ్

నిత్యందేవాయతనే వా భక్త్యాభగవంతం నారాయణమర్చయే త్తద్విష్ణోఃపరమంపదం గచ్ఛతీతి విజ్ఞాయత ఇతి చ. ఇదమేవహ్యస్య శాస్త్రస్య సర్వోత్కృష్టం యద్విష్ణుమేవారాధ్యత్వేన సర్వధావిధత్తే. అతేహభగవాన్ భాష్యకారచరణా శ్రీవైఖానససూత్ర తాత్పర్యచింతామణౌ దశవిధహేతు నిర్ణయప్రకరణే శ్రీమన్నారాయణైక పరత్వాదితి హేతుం శ్రీశాస్త్రస్య సర్వాతిశాయిప్రామాణ్యవత్త్వే నిరూపయాంచక్రుః ఇదంశబ్దేన పూర్వోక్త కారణజాతం పరామృశ్యతే, వేదేషు విభిన్ననామభిర్వ్యవ హృతేషు దేవేషు దేవదేవ ఉత్తమోజనార్దన ఏవేతిసిద్ధం, సఏ వాఖిలస్య జగత స్స్రష్టా పాతాహర్తాచ భవతి. జగత్స్రష్టేత్యత్ర విభక్తిలోప ఆర్షః, జన్మాద్యస్యయత ఇతి పరబ్రహ్మ లక్షణమనేన స్మర్యతే. 15. తస్యైవ బ్రహ్మణోలక్షణాన్తరాణిప్రస్తౌత్యాశ్రయ ఇతి. ఆశ్రయ ఇత్యాదీని సప్తవింశతి ప్రథమాంతాని. అత్రవచనాని, విశ్వమూర్తిర్మహామూర్తిర్దీప్తమూర్తిరమూర్తిమాన్ అనేకమూర్తిరవ్యక్తశ్శతమూర్తి శ్శతాననః ఇత్యాదీని, సర్వతః పాణిపాదం తత్సర్వతోక్షి శిరోముఖం. సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమా వృత్యతిష్ఠతి సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం, సర్వస్య ప్రభుమీశానం సర్వస్య శరణం బృహత్ ఇతి శ్వేతాశ్వతరోప నిషదిచ, పఠ్యతే. 18. తత్రసర్వం ప్రలీయతే జగదాది, తత ఏవోత్పద్యతే తథాసర్వమఖిలీః యతస్సర్వగ స్సన్తతస్సర్వం స్థితిమత్సఏవ పాలయతి. 19 పరంధామేత్యాదీని సప్త ప్రథమాంతాని,

జేయువాడు. 15. సమస్త చేతనా చేతనములకును ఆధారభూతుడును, త్రిగుణుడును, నిత్యుడును, నిర్గుణుడును, అతీంద్రియుడును, పరుడును, వేదమూర్తియు, లోకమూర్తియు భూతమూర్తియు, త్రయీమయుడును, పుణ్యమూర్తియు, తేజోమూర్తియు, యజ్ఞమూర్తియు, చిన్మయుడును, ఆనందమూర్తియు, సన్మూర్తియు, లోకమూర్తియు, అమూర్తియు, విశ్వచక్షుడును, విశ్వముఖుడును, విశ్వహస్తుడును, విశ్వపాదుడును విశ్వాత్మకుడును, విశ్వవేత్తయు, విశ్వగర్భుడును, అజరామరుడును, ఆయి యున్నాడు. 18. మరియు నీతడు సమస్తేంద్రియ గుణంబులచే నొప్పువానివలె తెలియ వచ్చుచు ప్రాకృతేంద్రియ గుణవివర్జితుడై పరమార్థమున బ్రకాశించుచున్నాడు. 18. వాని యందే జగదాదులు లయించుచున్నవి. వాని యందుండియేపుట్టుచున్నవి. వాడు సర్వవ్యాప్తి గావున సృష్టియందలి ప్రతిపదార్థమును తత్స్వరూపమ

నారాయణపరం బ్రహ్మ పరమాత్మాపరోऽవ్యయః 11
నారాయణః పర ఇతి శ్రుతిరాహ సనాతనీ

అగ్నిర్వైదేవానా మవమోవిష్ణుః పరమస్తదంత రేణ
సర్వాఅన్యా దేవతాః 12

సబ్రహ్మ సశివస్సేంద్ర సోక్షరః పరమస్స్వరాట్
ఏక ఏవపు మానాస్తే నబ్రహ్మనేశ్వర స్థ్సితః 13

అణోరణీయా న్మహతో మహీయాంశ్చ గుహాస్థితః
స్థాస్నువాంశ్చా భవశ్చేతి విష్ణవే చార్చతేతిచ 14

అస్మిన్నర్థేభాష్యం మరీచిఃపరంధామపరంజ్యోతి స్సర్వజ్ఞ స్సర్వశక్తిమయ స్సర్వాధారస్స నాతనసర్వకారణం. జ్ఞాతృజ్ఞేయ జ్ఞానవిహీనో జ్ఞానఘనో జాగ్రత్స్వప్న సుషుప్తి తుర్యస్థాన గోబహిః ప్రజ్ఞః ప్రజ్ఞా వస్థ స్థూలసూక్ష్మ విభాగేన వైశ్వానరతేజోరూపేణ భుంజానః విశ్వస్తైజసః ప్రాజ్ఞస్సర్వేషా మాత్మ గుహాయాం నిహితః, అయమర్థః, పరంధామ, పునరావృత్తిరహితం స్థానం మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మన విద్యత, ఇతి భగవద్వ చానాత్, పరంజ్యోతిః, యోవాపరంజ్యోతి పరంసందధానః పరమాత్మాపురుషం సంజనయిష్య సేస్వాహా, ఇతి శ్రుతేః, సర్వజ్ఞః, సర్వజ్ఞస్సర్వవిత్ ఇతిశ్రుతేః ఏతేననిష్కల స్వరూపకథన ప్రకరణేపి సర్వజ్ఞత్వ ప్రతిపాదనేన తస్యనిత్యం నిరతిశయానంద కల్యాణగుణాకరత్వం ప్రత్యపాది, సర్వశక్తి మయ ఇతిऽऽऽసర్వప్రాణి గతశక్తి ప్రచురః, ऽऽऽ జ్ఞాతృజ్ఞేయ ఇత్యాదినా తస్యక్రమేణా, విశ్వతైజస ప్రాజ్ఞస్వరూపం దర్శయతి, తత్ర జాగ్రదవస్థా నిర్వాహకోవిశ్వః, జ్ఞాతృజ్ఞేయ జ్ఞాతాజీవః, తస్యజ్ఞేయా ఇంద్రియాగ్రాహ్యాః, పదార్థాః, తద్జ్ఞాపకత్వాత్ విశ్వస్య

గుచున్నది. 19 పరంధామ, పరంజ్యోతి, గుణాతీతుడు, గుహాశయుడు, జ్ఞాన జ్ఞేయ జ్ఞాతృహీనుడు, విజ్ఞానబహులుడు, అక్షరుడును అయియున్నాడు. 20. జాగ్రత్స్వప్న సుషుప్తి తుర్యములనునాలుగవస్థలయందును చేతనునకు సాక్షియై యున్నాడు. జ్ఞానేంద్రియములకును, కర్మేంద్రియములకును, ప్రజ్ఞా సామాన్యమున కును గూడ నిర్వర్తకుడై హృదయాకాశమునందు వైశ్వానర స్వరూపుడై ప్రకాశించుచున్నవాడు. 21. హృదయకమలము నందలి యగ్నిశిఖా మధ్యమున ప్రజ్వలించుచున్న కనకమువంటి చాయగలిగియు గాలి లేని ప్రదేశమునందలి దీపశిఖవలె నిశ్చలుడయ్యును ఆకాశము నందలి విద్యుల్లేఖవలె చంచలుడును అయియున్నాడు. 22. వేదములచేతనే

వేదేషు పఠ్యతేచాస్మా ద్దేవదేవో జనార్దనః
హరిర్దేవో జగత్స్రష్టా పాతా హర్తాఖిలస్యచ. 15

ఆశ్రయస్త్రిగుణో నిత్యో నిర్గుణోతీంద్రియఃపరః
వేదమూర్తిర్లోకమూర్తి ర్భూతమూర్తి స్త్రయీమయః. 16

పుణ్యమూర్తి ర్యజుర్మూర్తి స్తేజోమూర్తిశ్చ చిన్మయః
ఆనందమూర్తి స్సన్మూర్తి ర్లోకమూర్తి రమూర్తిమాన్. 17

విశ్వచక్షు ర్విశ్వముఖ హస్తస్స్యా ద్విశ్వతోంఘ్రికః
విశ్వాత్మా విశ్వవేత్తాచ విశ్వగర్భోऽజరామరః 18

జ్ఞాతృజ్ఞేయత్వమవగమ్యతే, స్వప్నదశా నిర్వాహిక స్తైజసః, జ్ఞానవిహీనః, తైజసస్య బాహ్యేంద్రియవిషయ జ్ఞానశూన్య దశానిర్వాహకత్వాత్ జ్ఞానవిహీనత్వ మవగమ్యతె. సుషుప్తిదశానిర్వాహకః ప్రాజ్ఞః జ్ఞానఘనః; ప్రాజ్ఞస్య బాహ్యాంతరింద్రియ జ్ఞానరాహిత్యేన స్వస్వరూప జ్ఞాపకత్వాత్. ప్రాజ్ఞత్వం, జాగ్రత్స్వప్న సుషుప్తి తుర్యస్థానగః, జాగ్రత్ స్థానం చక్షుః, స్వప్నస్థానం కంఠః, సుషుప్తి స్థానంహృదయకర్ణికాగ్రం. తురీయ స్థానంహృదయాకాశః, తేషునేత్ర కంఠహృత్కర్ణి కాగ్రేషు విశ్వతైజస ప్రాజ్ఞసంజ్ఞయాస్థితః, హృదయే తురీయస్థానే తస్యాశిఖాయా మధ్యేపరమాత్మా వ్యవస్థితః, ఇతిశ్రుతి ప్రతిపాదిత స్వరూపఃతిష్ఠతి. తథానుపదంవదతి, హృదయ కమలాకాశొపలబ్ధ వైశ్వానర శిఖాయాం త్రిగుణాత్మకోవిష్ణుః పరమాత్మాతిష్ఠ, తీతి. బహిః ప్రజ్ఞః, బహిఃబాహ్యేవిషయే ప్రజ్ఞాయేన విశ్వ ఇత్యర్థః, ప్రజ్ఞావస్థః ప్రజ్ఞా అంతః కరణ చతుష్టయజ్ఞానం, తద్రూపావస్థా యస్మాత్సతైజస ఇత్యర్థః. స్థూలసూక్ష్మవిభాగేన వైశ్వానరతైజస రూపేణా భుంజానః షుదేవేషు? స్థూలంరూపాదికం భుక్తేవైశ్వానరః, సూక్ష్మమితరావిదితం స్వప్నపదార్థం భుంక్తేతైజసః, యద్యపి జీవస్యైవ భోక్తృత్వం తథాపి విశ్వతైజసయోర్భోజనే ప్రయోజక కృత్వాత్ బుతంపి బన్నావిత్యత్ర పరమాత్మనిర్దేశ వదుపపన్నం మాండూక్యోపనిషది, శ్రు, హిఃప్రజ్ఞో విభుర్విశ్వోహ్యన్తః

మెరుగదగినవాడును, లౌకికములగు యుక్తులచేతను, వివాదములచేతను, దితరములగు ప్రత్యక్షాను మానాది ప్రమాణముల చేతను యెరుగదగిన వాడును అయియున్నాడు. తనంతటతాను దెలియదగిన వాడు అనగా లక్షణానందాను భవముచే నొప్పువాడును, వాక్కులకును, మనస్సునకును గోచరుడుకాని వాడును, అనగా ప్రాకృతవాక్కులచే వాని మహిమ వర్ణనలవిగాని శక్తియుక్తుడును, మనసుచేతనైనను చింతింపరాని విభూతి గలవాడును అయియున్నాడు ...

విశ్వేంద్రియగుణాభాసో విశ్వేంద్రియ వివర్జితః

తత్రసర్వం తతస్సర్వంస సర్వం సర్వగశ్చసః 19

పరంధామ పరంజ్యోతి ర్గుణాతీతో గుహాశయః

జ్ఞానజ్ఞేయ జ్ఞాతృహీనో విజ్ఞాన బహులోऽక్షరః 20

ప్రజ్ఞస్తుతైజసః, ఘనప్రజ్ఞస్తథాప్రాజ్ఞ ఏకఏవ త్రిధాస్మృతః, దక్షిణాక్షీముఖేవిశ్వో మనస్స్వస్తశ్చ తైజసః, ఆకాశేచహృదిప్రాజ్ఞ స్త్రిధాదేహే వ్యవస్థితః, విశ్వోహిస్థూలభుఙ్నిత్యం తైజసః ప్రవివిక్తభుక్, ఆనందభుక్ తథాప్రాజ్ఞ స్త్రిధాతృప్తిం నిబోధత, ఇత్యాదిఏవంవిశ్వతైజస ప్రాజ్ఞ స్వరూపముక్త్వా తురీయస్వరూపమాహ సర్వేషామాత్మాగుహాయాం నిహితఇతి, అణోరణీయా, నితి శ్రుతి ప్రతిపాదిత స్వరూపం దర్శితం, జంతోరణుస్వరూపస్య అణీయానత్యంతమణుః, తద్రూపేణ గుహాయా మన్తర్ని హితః మహతోవిశ్వస్య మహీయాన త్వన్తమహాన్, మహతో విశ్వస్యా ప్యాధారతయామహత్తర ఇత్యర్థః. ఏతచ్ఛ్రుతిదర్శనేన జీవపరయోర్భేదో వ్యక్తః, మరీచిః, తస్మాద్ధృదయకమలాన్త రాకాశోపలబ్ధ వైశ్వానరశిఖాయాం త్రిగుణాత్మకోవిష్ణుః పరమాత్మా తిష్ఠతీతి అయమర్థః, తస్మాదేవం చేత్యర్థః, హృదయ కమలాంతరాకాశం దహరం, త్రిగుణాత్మకః, త్రయోగుణాయస్యాస్సా ప్రకృతిః, ఆత్మాశరీరం యస్యసః, భగవతశ్చి దచిచ్ఛరీరకత్వ స్యోక్తత్వాత్, సహి భగవత స్త్రిగుణవిశిష్టతా, నిర్గుణఇతి ప్రాకృత గుణ నిషేధస్య పూర్వమభి ధానాత్, 'మరీచిః' తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః, నబ్రహ్మాస శివ స్సేంద్ర, ఇతిశ్రుతిః, ఇతిస్వోక్తవిషయే శ్రుతిర్దర్శితా, ఏవంచ విష్ణు పరమాత్మ శబ్దాఃవేకార్థౌ, సవిష్ణు రేవ బ్రహ్మశివ ఇత్యాది సంజ్ఞాంలభత ఇత్యుక్తం. సృష్టిస్థిత్యంత కారణీం బ్రహ్మవిష్ణు శివాత్మికాం, ససంజ్ఞాం యాతిభగవానేకఏవ జనార్దనః, బ్రహ్మవిష్ణు శివాత్మికామితి విష్ణోరపి సహేతరాభ్యాంసారూప్యేణ ప్రతిపాదనాత్తురీయః పరమాత్మాన తచ్ఛబ్ద వాచ్య ఇతిచేదుచ్యతే, తత్ర జనార్దన ఇతి విష్ణుపర్యాయ వాచకేన నిర్దేశాద్విష్ణు రేవ

దగినదిగాదు, చింతింప దగినదియుకాదు. ఆవిభూతియొక్క పరిమితిని గూర్చిన ప్రశంసయే యిందున్నది గాని భక్తునియొక్క యప్రాకృత భగవదారాధనమునందలి గోచరములే యనునది వేరువిషయము 23 సత్య స్వరూపుడును, నిత్యమగునేకాక్షరమందు లీనమైనవాడును, అధికాకారము తోడ ప్రకాశించు నట్టియు స్వేతర సమస్త పదార్థము నట్లు ప్రకాశింపజేయునట్టి స్వభావము గలవాడును, సదసదాది శబ్దములచే నెరుగదగినవాడును, ఉపకారముచేయు తలంపుగల వాడును, తచ్ఛబ్ద వాచ్యుడును, ఓంకారశరీరుడును, నిత్యుడును, అనంతుడును, నిష్కలుడును, క్షీరమునందు నేతివలెను. అరణియం దగ్నివలెను అన్నియెడలను వ్యాపించి

జాగ్రత్స్వప్న సుషుప్త్యాదౌ తుర్యావస్థాస్వవస్థితః
అంతఃప్రజ్ఞో బహిః ప్రజ్ఞః ప్రజ్ఞా ప్రజ్ఞోఽప్యవస్థితః 21

స్థితోవైశ్వా నరాభాసో హృదయాకాశ గోచరః
హృత్పద్మాగ్ని శిఖామధ్యే ప్రజ్వలత్కన కద్యుతిః 22

నివాత ఇవదీపార్చి ర్విద్యుల్లేఖేవచాంబరే
జ్ఞానజ్ఞేయం స్వసంవేద్య మవాఙ్మానసగోచరం 23

తుర్యః పరమాత్మా స్థితికార్యే నిసర్గసిద్ధ సత్వగుణేనా వినా భూతతయాతయైవ సంజ్ఞయా న్వితః, మూర్తిత్రయా న్తర్భవతీతి జ్ఞేయం, నారాయణస్యతురీయత్వం శ్రుతిసిద్ధం. బ్రహ్మోప నిషది, అథాస్య పురుషస్య చత్వారి స్థానాని భవంతి నాభిహృదయం కఠం మూర్ధాచ, తత్ర చతుష్పాద్బ్రహ్మవిభాతి, జాగరితేబ్రహ్మా స్వప్నేవిష్ణుః, సుషుప్తౌ రుద్ర, ఇతి. అస్యార్థ ఉత్తరత్ర స్పష్టీకరిష్యతె. శ్రుతురీయమక్షరం స ఆదిత్యో విష్ణుశ్చేశ్వరశ్చ తస్యాశ్శిఖాయా ఇతిశ్రుత్యర్థోమహూపనిషదిచ ప్రత్యభిజ్ఞాప్యతే, తస్యాశ్శిఖాయామధ్యే పురుషః పరమాత్మ వ్యవస్థితః, సబ్రహ్మ స ఈశాన సోఽక్షరః పరమస్స్వరాట్ ఇతి అత్రయః పూర్వం నారాయణ ఇతి ప్రతిపాదితః పరమాత్మా సబ్రహ్మస ఈశాన ఇతి ప్రతిపాదితంభవతి, ఇత్యాది అత్రాపి జ్ఞాతృజ్ఞేయ జ్ఞానహీన ఇత్యేవపాఠస్స్యాత్, విజ్ఞానబహులఇతి ప్రాజ్ఞో వివక్షితః, అక్షరఇతి తుర్యస్థానగః పరమాత్మా వివక్షితః, సర్వమన్యత్ స్పష్టం. ప్రజ్ఞాప్రజ్ఞ ఇతి ప్రాజ్ఞపర్యాయ వాచకశబ్ద ఇవభాతి, సుషుప్త్యాదావిత్య త్రాదిశబ్దేన తుర్యావస్థానం గృహ్యతే. తుర్యావస్థాస్వితిచ తస్పృష్వవస్థాస్విత్యర్థే సమాస ఆర్ష ఇతి విశేషోభోధ్యః 21. వైశ్వానరాభాసః, తత్రాత్ తస్య వైశ్వానరాన్తర్యామిత్వాత్, తదాభాసః, స్థితోఽసౌహృదయాకాశే హృదయావ కాశే గోచరః 21

యున్నవాడును, ఆకాశవాయ్వగ్ని జలభూమ్యాత్మకమగు రూపముచే సకలు డగుటచే భక్తాభీష్ట పరిపూరణము చేసి యుత్కృష్టుడును. (ఆకాశ వాయువుల వలే నిర్లేపము సర్వవ్యాపకత్వము గలవాడును) జ్ఞానదీపమగు వేదమును లోకమునకు ప్రసాదించినవాడును, అగు పరమాత్మయారాధించ దగినవాడు, అతడు నిఖిలమునకు నాధారభూతమై యున్నాడు, అనాది నుండి యున్న వాడు. పురుషోత్తముడు, విష్ణువు, సర్వేశ్వరుడు. లక్ష్మీయుక్తుడు, సర్వకారణము లకు కారణమును అయియున్నాడు. 26. అతనితో సమానుడుగాని యధికుడు గాని వేరెవ్వడును లేడు, అతడు తత్స్వభావముచే నన్ని యెడలను నాలుగు ములుగ వ్యాపించుచున్నాడు. పాదము (నాల్గవవంతు) అర్ధము, ము (ముప్పాతిక) పూర్ణము అనుశక్తి భేదముచే కార్యార్థమై యీతడు

ఋతమేకాక్షరం బ్రహ్మ సదసచ్ఛోపకారకం
తదోంకారమయం నిత్య మనన్తంనిష్కలం పరం 24

అనంతానంద చైతన్యం తేజోరూప మరూపవత్
సర్పిర్వత్సర్వగంక్షీరే ऽరణ్యోరనలవత్ స్థితం 25

ఖం వాయువర్చః పరమం జ్ఞానదీప ప్రకాశకం

హృత్పద్మేతిస్పష్టోऽర్థః 22. నివాతేప్రదేశే దీపార్చి రివ అంబరే ఆకాశే విద్యుల్లేఖే నిశ్చలోయం చంచలశ్చేతి భావః, జ్ఞానేనవేద్యైః జ్ఞేయంతథా మరీచిః విమానార్చ కల్పేతస్మాత్పర మాత్మాజ్ఞేయః, జీవాత్మాజ్ఞాతా శ్రుతయోజ్ఞానమితి బ్రహ్మవాదినో వదంతీ శాస్త్రయోనిత్వాదితి పారాశర్యోప్య సూత్రయత్తస్యశ్రైకగమ్యత్వం తర్కా ప్రతిష్ఠానా తీతరాగమ్యత్వంచ. స్వసంవేద్యం తదను భవస్యవిలక్షణత్వోక్తేః, అవాఙ్మానసగోచర వాఙ్మనసాతీతం. 23. ఋతం, ఏకాక్షరం, బ్రహ్మసరసచ్చ, చకారోవిలక్షణార్థకః, సద్భవన సదప్యాస్త ఇతి. అసన్నేవసభవతి ...... సన్తమేనంతతో విదురితీతి శ్రుతిః, ఉపకారక తత్తచ్ఛబ్దవాచ్యం ఓంకారమయం, ఓంతత్సదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధస్స్మృ ఇతిభగవద్వాక్యం, నిత్యాదీని సప్తవిశేషణాని, అరూపవదితి మతుబానిష్కల శబ్దా వ్యాఖ్యాతః. క్షీరేసర్పిర్వత్సర్వగం అరణ్యోరనలవత్స్థితం, సర్వవ్యాపి నమాత్మాన క్షీరేసర్పిరివార్పితం, ఆత్మవిద్యాతపోమూలం తద్బ్రహ్మోపనిష్పరమితి శ్వేతాశ్వత శ్రూయతే. తిలేషుతైలం దధనీవసర్పి రాపస్స్రోతస్స్వరణీషు చాగ్ని ఏవమాత్మాऽత్మనిగృహ్యతేऽసౌ తత్త్వేనైనంత పసాయోऽనుపశ్య తీతిచ ఖంవాయువర్చోభి పరమం నిర్లిప్తత్వ సర్వగత్వాది విశిష్టం, జ్ఞానదీపస్య నిగమస్య ప్రకాశకం, పరమాత్మః వేదవక్తృత్వాత్, యోబ్రహ్మాణం విదధాతిపూర్వం యోవైవేదాంశ్చ ప్రహిణోతితస్మా ఇ శ్రుతిః. తస్యమహతో భూతస్యనిశ్శ్వసితం యదృగ్వేద ఇతిచ. 25 ఈదృశలక్షణ లక్షిత వస్తు పరమాత్మా ఆరాధ్యః సకళీకృత్యేతి భావః, నిష్కలితస్య భక్తాభీష్ట పూరణేऽవర్హత్వా సోऽయంనిఖిలాధారః పురాణశ్చాసౌ పురుషోత్తమః, అతోస్మిలోకేవేదేచ ప్రథిత పురుషోత్తమః, ఇతి భగవదుక్తిః, విష్ణుఃతన్నిర్వచనం యథాభారతే, వ్యాప్యామేరోదః పార్థకాన్తిశ్చాభ్యధికాస్థితా, క్రమణాచ్చావ్యహం పార్థవిష్ణురిత్యబి సంజ్ఞితః ఇతి తథా విష్ణుపురాణే, యస్మాద్విష్ట మిదం సర్వం తస్యశక్త్యా మహాత్మనః, తస్మాదేవోచ్యతేవిష్ ర్విశేర్ధాతోః ప్రవేశనాత్, ఇతిచ, సర్వేశ్వరః శ్రీమాన్, శ్రియానిత్యయుక్తః సర్వకార కారణంమత్తస్సర్వం ప్రవర్తత ఇతిగేతోక్తేః 26. హీనాధికసమః అధికేనసమేనవా

పురుష సత్యాచ్యుతానిరుద్ధులని నాలుభిన్న నామధేయములచే వ్యవహరింపబడుచున్నాడు. ఈ నాల్గును క్రమముగ బ్రాహ్మణాది చాత ర్వర్ణముల ధర్మములయొక్క సమృద్ధికై కల్పింపబడినవి. ఈ వర్ణధర్మము

ఆరాధ్యోనిఖిలాధారః పురాణ పురుషోత్తమః 26

విష్ణుస్సర్వేశ్వర శ్రీమాన్ సర్వకారణకారణం
హీనాధికసమస్తత్వభావేనచ చతుర్విధః 27
సర్వతః పాదతశ్చార్ధాత్త్రిపాదా త్కేవలాదపి

హీనః, రహితః, హీనోధిక సమాభ్యా మిత్యర్థే అర్షత్వాచ్ఛక్తికల్పనా నతత్సమశ్చా భ్యధికశ్చదృశ్యతే, ఇతి శ్రుతిః, నత్వత్సమోస్త్యభ్యధికః కుతోన్య ఇత్యభియుక్తాః, తత్త్వభావేన చతుర్విధశ్చాయం పురుషః, సర్వతస్సర్వత్రదైశికీ కాలికీ చేయంసత్తా, వ్యాప్యవర్తత ఇతి సంబధ్యతే, నిష్కలత్వాత్. తదేవవివృణోతి, పాదతా ఇత్యాదినా, పాదతః అర్థాత్ త్రిపాదాత్కేవలాదపి, యద్వాబ్రాహ్మణాదిరూపేణ చతుర్విధోఽయం పురుషః యధాపాదతః పాదాభ్యాం శూద్రః, అర్ధాదూరుభ్యాం వైశ్యః, త్రిపాదా ద్బాహుభ్యాం రాజన్యః కేవలాన్ముఖతస్సాక్షాద్బ్రాహ్మణః ఇతి బ్రాహ్మణోఽస్య ముఖమాసీది త్యాదిశ్రుతిః. అస్మిన్ పక్షె పురుషాద్యా ఇత్యస్య బ్రాహ్మణాద్యా ఇత్యర్థోబోధ్యః, బ్రాహ్మణ స్యైవమోక్షా త్వశ్రుతే, పురుషశబ్దస్య బ్రాహ్మణమాత్ర వ్యక్త్యారూఢిం సిద్ధవత్కృత్య కృతోయం ప్రయోగ ఇత్యూహితు ముచితత్వాత్. ఉత్తరశ్లోకే బ్రహ్మక్షత్రియేత్యాది నా పూర్వోక్త ప్రస్తావ స్యైవ ప్రపంచి తత్వస్వారస్యాచ్చ, ఉభయస్మి న్నిష్కలః పరమాత్మా పురుషోత్తమోఽన్యః ప్రతీయత ఏవేతి తత్త్వం. సోయమాత్మా చతుష్పాదితిశ్రుతి, తాఏవపంచ మూర్తీః ప్రాహ చతస్ర ఇతి తామూర్తయః పురుషాద్యాశ్చతస్రః కార్యార్థం ప్రకల్పితాః, భగవన్నియమనాను సరణేనభక్తైః ప్రకల్పితాః, ఉపాసకానా కార్యార్థం బ్రహ్మణోరూపకల్పనం ఇతి స్మృతేః, బ్రహ్మణో రూప కల్పన మిత్యత్ర కర్తృత్వం బ్రహ్మణఏవ, రూపస్వీకారో బ్రహ్మణేవేచ్ఛాధీన ఇత్యర్థః. ఉపాస కానా మిష్టార్థపూరణాయ బ్రహ్మ సకళీభవతీతి పరమార్థం సతుకల్పనమిదము పాసకానా మిచ్ఛాధీనం, ఉపాసక కల్పనస్య అవ్యావర్తకత్వాత్. పాదత ఇత్యత్రనయథా క్రమాన్వయః 28. తాః పునర్మూర్తయ శ్చతుర్వర్ణ ధర్మసమృద్ధిదాః, తేచ వర్ణధర్మా భూరాదిలోక చతుష్టయాధిదైవ తాఃచతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్గతిః, చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేద విదేకపాదితి స్మృతిః 29. అత్రపురుషస్య మూర్తివిభాగే శ్రౌతప్రసిద్ధం వీతిహోత్రదృష్టాంత మాహయాగాదీతి, అథ యథాయాగాది సర్వస్యకృత్స్నస్యాగ్నిహోత్రస్య సంబంధినాం ఇష్టానం యాగాద్యుద్దేశ్య కానాం యజ్వనా మిష్టానాం పూర్తయే స్వలాంఛనః స్వాఽసాధారణ లక్షణ లక్షితః అర్థాత్ వీతిహోత్రః ఆహవనీయాన్వాహార్య గార్హపత్యావసత్థ్యక ఇత్థంచతూరూపః ఏవ మిత్యుత్త రశ్లోకేన సంబధ్యతే, అత్రయాగాది సర్వస్యేష్టీనాం తృప్తయే ఇతిపాఠోదృశ్యతె 30.

యొక విలక్షణ భాగము) పురుషసత్యాచ్యుతా నిరుద్ధులకు పరస్పరము పాదాది భేదము లుండునట్లు ప్రమాణాంతరము కనుపింపదు. గావున నిది పైజెప్పబోవు చతుర్వర్ణధర్మ సమృద్ధిదాః అను పదము వలన నట్టి భేదమును లోకభేదముల నధిదైవతముగ జెప్పుచుండుటచే నట్టి భేదమును

చతస్రో మూర్తయస్తాస్తు పురుషాద్యాః ప్రకల్పితాః 28
బ్రహ్మక్షత్రియ విట్ఛూద్ర వర్ణధర్మ సమృద్ధిధాః
భూర్భువస్స్వర్మహశ్చాపిలోకా వర్ణసమాశ్రితాః 29
యాగాది సర్వస్యేష్టానాం పూర్తయేఽథస్వలాంఛనః
ఆహవనీయా న్వాహార్య గార్హపత్యావసత్థ్యకః 30

ఏవమిత్థం ప్రకారేణైవ చతుర్భిశ్చగుణైర్ధర్మ జ్ఞానైశ్వర్య వైరాగ్య రూపైస్సహైకః పూర్ణాభిన్నోవిభక్తః, అత్ర విమానార్చనకల్పే మరీచిః తస్మాద్విష్ణు పురుష సత్యాచ్యుతానిరుద్ధ ఇతి మూర్తీనాం పంచానా మాదిమూర్తి ర్విష్ణుస్తద్భేదాశ్చ తస్రోమూర్తయః తద్విష్ణోశ్ర మాపనుదాయ చతుర్గుణాయేతి శ్రుతిః తస్మాద్బ్రహ్మ చతుష్పాద్భవతి. పాదాదర్ధాత్త్రి పాదాత్కేవ లంశాత్, క్రమేణా ధర్మజ్ఞానైశ్వర్య వైరాగ్యైరితి విషయగుణై శ్చతుర్భిర్మూర్తయో భవంతి. ఆదిమూర్తేశ్చతు ర్మూర్తిత్వా త్రమేణ విష్ణుర్మహావిష్ణు స్సదావిష్ణు స్సర్వవ్యాపీ నారాయణ ఇతి చతుర్మూర్తయో భవంతీతి. 30. కుండానా మాశ్రయాత్తత్తత్కుండ రూపాధిష్టాన భేదాత్ మంత్రదిగ్భేదీ ప్రయోగభేదే యథాపంచధాఽయమేక ఏవాగ్నిర్వ్యవహ్రియతే స్వయమేకస్సభ్యస్త్ర త్రభవా మూర్తయశ్చతస్త్ర ఆహవనీయాద్యా ఇతి పంచధాగ్నేర్వ్యవహారః, తథైవైకోదేవోఽనేక ప్రకార స్స్మృతః, ఏషవిష్ణుర్నామ ప్రధాన మూర్తి స్తతఃకార్యార్థం ప్రకల్పితాః పురుషాదయశ్చతస్ర దుద్గతా మూర్తయ ఇతి పంచమూర్తిత్వం పరమాత్మనః తథాన్యత్రాపి, తత్ర పరమాత్మైవ పంచధాభవతి, సవా ఏషపురుషః పంచధా పంచాత్మేతి శ్రుతిః తస్మాదాకాశాది మహాభూతానా పరమాత్మ నిభేద ఏవ సభ్యాహవనీయా న్వాహార్య గార్హపత్యావసత్థ్యా ఇతి పంచాగ్నివ త్పంచధా భవతి. పంచధాగ్నిన్వ్యక్రామత్ విరాట్ ప్రష్టేతి శ్రుతిః ఇతి.31. పురుషా దీనాం చతస్రుణాం మూర్తీనా ముక్తకార్యార్థత్వ మేవ విప్రుణోతి, కాన్తీతి ఉక్తో మూర్తయః కాంతిపుష్టి సుఖేష్టార్థానాం క్రమా ద్యథాక్రమేణా

సంకల్పించుకుని పాదతః, అర్ధతః అను మొదలగు పదముల కర్థసంగతి యని యెరుంగునది. 29. యజ్ఞశీలురగు మహనీయుల యుద్దేశము లను పూర్తిచేయుటకై యసాధారణ లక్షణలక్షితుడగు నగ్నిహోత్రుడు ఆహవనీయా న్వాహార్యగార్హ పత్యావ సత్థ్యములనెడి నామభేదముచే నాల్గు విధములుగ నొప్పుచుండు నటుల పురుషుడు (పరమాత్మను) ధర్మ జ్ఞానైశ్వర్య వైరాగ్యములనెడి నాల్గుగుణములచే కూడి విభిన్న నామములచే వ్యవహరింపబడుచున్నాడు. 30. ఆశ్రయములగు కుండములనెడి భేదము చేతను మంత్రప్రక్రియాభేదముచేతను ఒకటగు నగ్నియనేక రూపభేదముల దాల్చునటుల నొక్కడగు పరమాత్మయనేక విధము లగుచున్నాడు. 31. ఇట్లనేక విధములగు నీమూర్తిభేదములు కాన్తి పుష్టి సుఖము ఇష్టార్థముల

ఏవమేవపుమాన్ భిన్న శ్చతుర్భిశ్చగుణైస్సహ. 30

కుండానామాశ్రయాన్మంత్రదిగ్భేదే పంచధాయధా 31

అగ్నిరేక స్తథాదేవశ్చైకోనేక విధస్స్మృతః
కాన్తిపుష్టిసుఖేష్టార్థాః ప్రశస్తామూర్తయః క్రమాత్ 32

ప్రశస్తాస్సాధకాః 32 అనేకవిధస్యాస్య తత్త్వేమానాన్తరాణి ద్రఢయతి శ్రౌతప్రియ ఇత్యాదినా శ్రౌతానామర్థానాం శ్రుత్యను బంధినాం శాస్త్రాన్తరాణాంచ ప్రియ తదుప బృంహితత్వాత్ వేదైశ్చసర్వైరహమేవ వేద్యోవేదాన్తకృద్వేదవిదేవచాహ మితి భగవదుక్తేః, శ్రుతిగ్రాహ్యః వైదికానాం వరప్రదః బ్రహ్మప్రియస్తపసాంప్రియః పరంబ్రహ్మ బ్రహ్మణ్యో బ్రాహ్మణప్రియః బ్రహ్మణ్యో బ్రహ్మ విద్బృహ్మి బ్రహ్మజ్ఞో బ్రహ్మణప్రియ ఇతి నామసహస్రే, బ్రహ్మణ్యా ప్రాప్తయేపరం బ్రహ్మణ్యై రారాధితః పరమాత్మాబ్రహ్మ, 33. తస్య విశ్వాత్మనో విష్ణోరర్చనం త్రివిధం భవతి. యథోచ్యతే, అథ మానసం వాచికం కాయికం చేతి. తదర్చనం త్ర్యవయవకం. కాయికమితి స్పష్టోర్థః 35.ఏషు చతుర్షు చతుర్థా విభక్తేష్వర్చనేషు మానసం తావదుచ్యతే, వివిక్తేవిజనే విశదేసంకుచితె, దేశే తపోయోగ్యప్రదేశే సుఖాసనే నిమ్నోన్నతాది రహితె ఉప విష్టస్స్వస్తికాసన ఆసీనో నిస్సంగస్సంయతేంద్రియః యమాదిభి రిత్యాది స్పష్టోర్థః 36, 37, 38, 39, 40, 41, 42. శంఖచక్రధరమిత్యాది అస్మింఛ్లోకే వరదా భయధారిణమితి పాఠస్స్యాత్. 43. ధ్యాత్వైవమితిస్పష్టోర్థః 44. అథమానసిక మర్చనం అథ

నిచ్చునవైయున్నవి. 32 ఈ పరమాత్మయే శ్రుతులకును శ్రుతులనను బంధించు శాస్త్రాంతరములకును ప్రియుడును, అనగా వానిచే నత్యాదరముగా కొనియాడబడువాడును, అట్టిశ్రుతులచేతనే గ్రహింపదగినవాడును వైదికులకు ఎరప్రదుడును బ్రహ్మప్రియుడు, పరంబ్రహ్మ బ్రహ్మణ్యుడు బ్రాహ్మణ ప్రియుడు అని పిలువబడు వాడును, బ్రహ్మణ్యప్రాప్తి నుద్దేశించి బ్రహ్మణ్యు లచే నారాధింపబడువాడును అగుచున్నాడు. 33. అట్టి విశ్వాత్మకుడగు విష్ణుని యర్చనము మూడు విధములుగ జెప్పబడుచున్నది. 34. (ఈయర్చన మనునది యీ గ్రంథమునందు ప్రతిపాదింపబడు ముఖ్య విషయమై యున్నది. అర్చనము వలన నైహికాముష్మిక సిదికలుగుటచే నిట్టి యర్చనము నుపదేశించుట మరీచి మహర్షివంటి లోకోద్ధారకునకు తగి యున్నది.) అట్టి యీ యర్చనము, మానసికము, వాచికము, కాయికము అని మూడు విధములగు చున్నది. అందీ కాయి కార్చనము తిరిగి

శ్రౌతప్రియశ్శ్రుతి గ్రాహ్యో వైదికానాం వరప్రదః
బ్రహ్మప్రియఃపరంబ్రహ్మబ్రహ్మణ్యో బ్రాహ్మణప్రియః 33
బ్రహ్మణ్యారాధితో బ్రహ్మ బ్రహ్మణ్య ప్రాప్తయేపరం.
తస్య విశ్వాత్మనో విష్ణోరర్చనం త్రివిధం యధా. 34
మానసం వాచికంవాథ కాయికంవాపి తత్ర_త్రయం
కాయికం ద్వివిధం ప్రోక్త మమూర్తంచ సమూర్తకం 35
అర్చనేషు చతుర్ష్వేషు తావన్మానసముచ్యతే
వివిక్తే విశదే దేశ ఉపవిష్టస్సుఖాసనే. 36
స్వస్తికాసన ఆసీనో నిస్సంగ స్సంయతేంద్రియః
యమాదిభిరుపేతస్స న్నాసాగ్రేన్యస్తలోచనః 37
తద్గతేనైవమనసా ధ్యానకర్మణి నిశ్చలః
ధ్యాయేద్ధృత్పుండరీకస్థం విమలంరవిమండలం 38
తన్మధ్యేమండలం సౌమ్యం తదంతస్థం తదుజ్జ్వలం
దివ్యాసన సమాసీనం లక్ష్మీభూమిధరంపరం, 39
స్వర్ణవర్ణం మహాబాహుం శుకపింఛ నిభాంబరం
హేమవర్ణ విచిత్రైస్తు కిరీటమకుటాదిభిః 40
సర్వైరాభరణైర్దివ్యై శ్రీవత్సేనతు భాసితం
కౌస్తుభోద్భాసితోరస్కం ప్రసన్న వదనాంబుజం 41

మానసిక మర్చనముక్త్వా వాచిక మాహఋగ్యజురితి, 45. అధామూర్తం కాయిక మర్చనమాహాగ్నిహోత్రేష్వితి. యదగ్నిహుతం సంస్కృతం వర్ధవిష్యం నామ భవతితత్ సోంగేష్వగ్ని హోత్రేషు హుతం హోమః కాయిక మమూర్తమర్చనం హోమార్చనం భవతి. 46. అథకాయికం సమూర్తమర్చన మహ ప్రతిమాయామితి, ద్రవ్యైః యథా విభవలబ్ధైః 47. అదైషామర్చనానాం యుగభేదేన నియమమాహకృతేత్వితి.

యమూర్తమనియు సమూర్తమనియు, రెండు తెరంగులగుచున్నవి. 35. ఇట్లు నాలుగు విధములుగ జెప్పబడిన యీ యర్చనము నందు

అబ్జనేత్రాస్యపాణ్యంఘ్రిం చతుర్బాహుం సుఖోద్వహం
అవ్యక్తం నిష్కలం నిత్యం నిర్గుణం చ పరాత్పరం. 42

శంఖచక్రధరంసౌమ్యం వరదాభయపాణినం
చింతయేత్సకలం విష్ణు మర్చార్థం సర్వకారణం 41

ధ్యాత్వైవం విగ్రహైస్సర్వైర్మనసైవతు కల్పితైః
క్రియతేఽభ్యర్చనం విష్ణో ర్యత్తన్మానసమీరితం. 44

ఋగ్యజుస్సామభిర్మంత్రై ధార్యత్వైవం యద్ద్విజాతయః
స్తువంతి పరమాత్మానం తద్వాచికముదీరితం, 45

అగ్ని హోత్రేషు సాంగేషు ధ్యాత్వైనం యద్ద్విజాతయః
యద్ధవిష్యం చాగ్నిహుతం తదమూర్తంతు కాయికం. 46

ప్రతిమాయాం కృతాపూజాద్ద్రవ్యైః పాద్యాసనాదిభిః
సమూర్తమితి తత్ప్రోక్త మర్చనం మునిపుంగవైః 47

48. అథేదమర్చనం స్వార్థమభిధాయ చతుర్ష్వపి యుగే ష్వస్మాత్స్వార్థా దర్చనాద్విలక్షణ మన్యత్పరార్థాభిధ మర్చనమాహ చతుర్ష్వపీత్యాదినా. స్వార్థం గృహార్చనం ప్రోక్తం పరార్థంత్వాలయార్చనం. పరార్థంస్యాజ్జగచ్చక్షు స్స్వార్థంస్యాద్గృహదీపికా ఇత్యాద్యుక్తైః పరార్థార్చన మాలయోర్చన మితి ఫలితం తచ్చమంత్రోచ్చార క్రియా ద్రవ్యధ్యాన భావాభిధైః పంచభిరంగై రుపేతం. 49. తదేవ వివృణోతి ద్వాత్రింశదితి ఇద ముపలక్షణ మష్టోత్తర సహస్రోపచారాదీనాం పరివారగణాన్వితం పరిషద్విశేష దేవతా పూజాయుతం నిత్య హోమోత్సవాంతం ప్రాయశ్చిత్త క్రియా క్రమయుతం చ భవతి. 50. తదుక్త లక్షణం పరార్థార్చన మాలయార్చనం సర్వలోకాభివృద్ధిదం తత్ఫలదం భవతి. 50. ఇయతాగ్రంథే నార్చనస్య గ్రంథేఽస్మిన్ ప్రతిపాద్యత్వం, ప్రతిజ్ఞాతంభవతి, అస్యోపన్యాసే గమకం తత్పరమప్రయోజన కథనేనాహ విమానార్చనకల్పే మరీచిః అథాయం దేహి జన్మకృత్వా భార్యామయ పాశనిబంధితో భగవన్మాయామోహితత్వా త్కామ క్రోధ లోభ మోహ మద

మానసార్చనమును చెప్పుచున్నాను. నిర్మానుష్య మగునట్టియు, ప్రసన్నమగు నట్టియు చోట సమ ప్రదేశము నందు స్వస్తి కాసనమనం దాసీనుడై సంగరహితుడై యింద్రియ నిరోధము జేసి యమ నియమాసన ప్రాణా యామ ప్రత్యాహార ధ్యాన ధారణముల నభ్యసించుచు, నాసికాగ్రమున దృష్టిని

కృతేతు మానసం శ్రేష్ఠం త్రేతాయాం యజనంపరం
ద్వాపరే ప్రతిమార్చాచ కలౌచింతనముత్తమం. 48
చతుర్ష్వపి యుగేష్వేవం విశేషస్తు యుగే యుగే
మంత్రోచ్చార క్రియాద్రవ్య ధ్యానభావాంగ పంచకం. 49

మాత్సర్య హింసాదీని కరోతి. యోనిద్వారేణ నిష్క్రమ్యపాపీయసీం యోనింప్రాప్య పునర్జాయమాన స్స్వర్గనరకఫలేషు కర్మసు ప్రవర్తతే. తస్మాద్భగవన్మాయామోహితత్వా ద్భగవంతం సమాశ్రిత్య భక్త్యానారాయణ ముపాసీత, తదుపాసనాత్సోపి భక్తవత్సలత్వా ద్భక్తాను కంపయా స్వమాయాం విమోచయతి, తతస్సమ్యక్ జ్ఞానంప్రవిశతి పశ్చాదా శ్రమధర్మసంయుక్తో భగవదారాధనం కరోతి, తదారాధనేన సంసారార్ణవనిమగ్నో జీవాత్మా పరమాత్మానం నారాయణం పశ్యతి. సోప్య పునరావృత్తికం దివ్యలోకం ప్రాపయతి. పశ్చాత్కృతకృత్యోభవతీ. త్యాదినా, తచ్చార్చనం ప్రకారాన్తరేణ చతుర్ధావిభజ్య తత్రాపి ప్రతిమార్చనం వరిష్ఠమాహసఏవ, అధసమారాధనం చతుర్విధం భవతి జపహుతార్చన ధ్యానానీతి సావిత్రీ పూర్వం వైష్ణవీమృచ మష్టాక్షరం ద్వాతశాక్షరం చ భగవంతం ధ్యాత్వా భ్యసేత్సజపః అగ్నిహోత్రాది హోమోహుతం గృహే దేవాయతనేవా వైదికేనమార్గేణ ప్రతిమాదిషు పూజయేత్తదర్చనం నిష్కల సకలవిభాగంచ జ్ఞాత్వాऽష్టాంగయోగమార్గేణ పరమాత్మానాం జీవాత్మనా చింతయే త్తద్ధ్యానమితి తే ష్వర్చనం సర్వార్థసాధనం సాదితి. మానసీ హోమ పూజాచ బేరపూజేతి సాత్రిధా ... ఏషాతు మానసీపూజా బేరపూజా విశిష్యత ఇత్యయ మన్యో విభాగ ప్రకారః అత్ర వాచికస్యనాను ప్రవేశః సార్థక్యేసకృతః అముమేవార్థం ప్రకారాన్త రేణాన్యే ప్రాహుః అగ్నౌతిష్ఠతివిప్రాణాం హృదితిష్ఠతియోగినాం, ప్రతిమా స్వల్ప బుద్ధీనాం సర్వత్ర విదితాత్మనా మితీ మిత్యస్యాసపాతత్వము క్వాతత్రా ప్రఅతుల్పబుద్ధీనామత్తానా మితి భావ్యమితి సుదంరాజాచార్యాదయః అత్ర యథా యథ మేషాం విభాగానాం సమన్వయా బోధ్యం అత్రోత్తమ బ్రహ్మవిద్యాసారౌऽస్మత్త్రకరణ స్పర్శీవాదో విరిఖ్యతె, నను ధ్యాయన్ కృతే యజర్యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేऽర్చయన్, యదాప్నోతి తదాప్నోతి కలౌసంకీర్త్యకేశవ, మితికలియుగే కీర్తనస్య సర్వసాధనత్వముక్తం కథం తదర్చనస్యేతి చేదుచ్యతే, భాగవతే కలౌకృష్ణం త్విషాకృష్ణం సాంగోపాంగాస్త్ర పార్షదం

నిల్చినవాడై పరమాత్మయందు నిలిపిన మనసుగలిగి ధ్యానమునందు నైశ్చల్యము గలిగి హృదయ కమలమును వికసితముగ నుండునటుల ధ్యానించవలయును. ఆ హృదయ కమలమందు సూర్యమండలమును, ఆ సూర్యమండల మధ్యమున చంద్ర మండలమును, ఆ చంద్రమండల మధ్యమున ప్రకాశించువాడును దివ్యాసనమునం దాసీనుడైనవాడును,

ద్వాత్రింశ దుపచారేణ పరివార గణాన్వితం
నిత్య హోమోత్సవాంతంచ ప్రాయశ్చిత్త క్రియాక్రమం. 50

యజ్ఞైస్సంకీర్తనప్రాయైర్యజంతి హి సుమేధస. ఇతి యజనాంగతయా సంకీర్తనముచ్యతే అస్య వ్యాఖ్యాప్రకారః సంకీర్తనా ప్రాయై స్తోత్రబహులైర్యజ్ఞైరర్చ నైర్యజంతీతి భగవాంశ్చ తథోపదిశతి మద్యాజీమాం నమస్కు'ర్వితి. ఏవంచ ప్రతిమార్చనమేవ సర్వప్రధానం. ప్రతిమాం వినాయత్ స్తోత్ర వందనాదికం క్రియతే తద్భిత్తింవినా చిత్రలేఖనం భవతీతి కించభేరపూజా మానస హోమపూజాభ్యాం సముచ్చితా సతీ విశిష్యత ఇత్యయమపదో హేతు సదొత్కృష్టే స్మర్యతే యథా నవనీతెతతో మానసికార్చనం కుర్యాదిత్యారభ్య భగవాన్ పుండరీకాక్ష ప్రీత్యాయత్తుమయాకృతం, అత్మత్కుదేవేశ బాహ్యేత్వాం సమ్యగర్చయే, ఇతి శ్లోకంపఠ్యతే ఇత్యల విస్తరేణ. అస్మిన్నాధ్యాయే ఋషిప్రశ్నోత్తరం పరబ్రహ్మలక్షణం అర్చనస్వరూప కథనమిత్యంశాః ప్రతిపాదితాః ఆహత్య శ్లోకానాం సంఖ్యాసార్ధ పంచాశత్. ఇతి ప్రథమోఽధ్యాయః

శ్రీభూమిసహితుడును, పరాత్పరుడును, స్వర్ణవర్ణుడును, మహాబాహుడను, శుకపింఛము వంటి కాంతిగల వస్త్రముల ధరించువాడును, హేమవర్ణ విచిత్రములగు కిరీటమకుటాది సర్వా భరణములచే శోభించువాడును, శ్రీవత్సముచే భాసించువాడును, కౌస్తుభ మణిచే నలంకరింపబడిన విశాలవక్షస్థలము గలిగినవాడును, ప్రసన్నమగు ముఖపద్మము గలవాడును, పద్మములవంటి నేత్రములు ముఖము హస్తములు పాదములు గలవాడును, చతుర్బాహుడును, సుఖో ద్వహుడును, అవ్యక్తుడు, నిష్కలుడు, నిత్యుడు, నిర్గుణుడును పరాత్పరుడును అయినవాడును, శంఖచక్రధరుడును, సౌమ్యు డును, వరదాభయపాణియు, సత్వకారణుడునగు విష్ణుని యర్చా ర్హునిగ మనమునందు చింతించి సంకల్పించవలయును. 43. ఇట్లు చింతించిన పరమాత్మకు మానసికముగ సంకల్పించబడిన యుపచారముల జేయ వలయును. ఇట్లు చేయబడిన యర్చనమునే మానసికార్చనమందురు. 44. ఋగ్యజుస్సామ మంత్రములచే ధ్యానించి బ్రాహ్మణులు పరమాత్మను చింతించు ప్రకారమే వాచికార్చన మనంబడును. 45. అగ్ని హోత్రమునందు వ్రేల్చబడు హోమ విధానమే యమూర్తమగు కాయికార్చన మనవొప్పును. 46. ఆసన పాద్యాచమననాది వివిధోపచారములచే ప్రతిష్ఠితమగు దేవతాబింబము

తత్పరార్ధార్చనం ప్రోక్తం సర్వలోకాభివృద్ధిదం.
ఇత్యార్షే శ్రీ వైఖానసే మరీచి ప్రోక్తాయామానన్ద
సంహితాయాం ప్రథమోऽధ్యాయః

సందర్భనము సమూర్తమగు కాయికార్చన మనంబడును. 47. కృతయుగము నందు మానసికార్చనము, త్రేతాయాగమునందు హోమ పూజయు, ద్వాపరమందు విగ్రహార్చనమును కలియుగమునందు హరినామ చింతనమును తుల్య ఫలదములని యొకమతమైయున్నది. 48. నాలుగు యుగముల యందును విలక్షణమగు నీవిశేషము తెలుపబడినది. ఇంతియే గాక యీ నాలుగు యుగములందు కూడ, మంత్రోచ్చారణము, క్రియ ద్రవ్యము, ధ్యానము, భావము అను నంగపంచకముతో గూడియు అష్టోత్తర శతోపచారములు మొదలగు నుపచార భేదములచే గూడియు పరిషద్దేవతల విశేష పూజలచే నలరారియు, నిత్యహోమము, ఉత్సవము, ప్రాయశ్చిత్తము మొదలగు క్రియా కలాప బాహుల్యము గలగియు, నుండుటచే సర్వోత్కృష్టమై పరార్ధార్చన మనునది సర్వలోకాభివృద్ధిదమని కొనియాడ బడుచున్నది.

ఇది యార్షమగు నట్టియు శ్రీ వైఖానస మహాశాస్త్రమున మరీచి ప్రోక్తమగునట్టియు నానంద సంహిత యందు ఋషి ప్రశ్నోత్తరము. పరబ్రహ్మలక్షణ వేధనము అర్చన త్రైవిధ్యము అర్చనస్వరూపము పరార్ధార్చనమహిమము అను నంశములుగల ప్రధమాధ్యాయము.



శ్రియైనమః
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణేనమః
శ్రీమద్విఖనస మహా గురవే నమః

# మరీచిప్రోక్తా ఆనన్దసంహితా

## అథ ద్వితీయోऽధ్యాయః

### శాఖాను క్రమణమ్

అతఃపరం ప్రవక్ష్యామి శాఖానుక్రమణం బుధాః
బహుశ్రుంగ శ్చతుస్సానుః పృథులో వేదపర్వతః 1

కృష్ణద్వైపాయన స్తంతు విభజ్య సమగాపయత్
చతుర్భ్యశ్చతురోవేదాన్ తత్క్రమో వక్ష్యతేऽధునా. 2

శ్రుణ్వంతుమునయ స్సర్వే యతవాక్కాయ మానసాః
ద్వైపాయనస్య శిష్యాస్తు చత్వారః కథితాః క్రమాత్. 3

పూర్వస్మిన్నధ్యాయే తావదాలయార్చనం ప్రక్రాన్తం అస్మిన్నధ్యాయే తదర్చనక్రమ విధాయకస్య శాస్త్రస్య ప్రామాణ్య ప్రదర్శనాయ వేదశాఖానుక్రమణ ప్రకారం వ్యాఖ్యాస్యత్యతః పరమిత్యాది నా:- అత్ర వేదాస్త్వావ త్ప్రమాణం భగవదాజ్ఞారూపత్వాదితి సిద్ధవత్కృత్యా యమనువాదః కృతః. అతఃఘరమిత్యర్చనస్వరూపస్య కథ నానంతరం, అనుక్రమణం పారంపర్య ప్రాప్తిః ఇదం శాఖానుక్రమణ

ఓ మహర్షులారా! అర్చనమును గూర్చి పూర్వాధ్యాయమునందు చెప్పి ఆయర్చనమును విధించిన మహాశాస్త్రముయొక్క స్వరూపమును చెప్ప దలంచి వేదశాఖల యనుక్రమణమును చెప్పుచున్నాను. అనేక శృంగములు గల్గి నాలుసానువులతో విశాలమగు వేదపర్వతము ప్రకాశించు చున్నది. 1. కృష్ణ ద్వైపాయనుడను వ్యాసుడు ఆవేదపర్వతమును నాలు భాగములుగ విభజించి నలువురచే నధ్యయనము చేయించెను. ఆక్రమ మిప్పుడు చెప్ప బడుచున్నది. 2. ఓ మహర్షులారా! ఈయంశమును త్రికరణ శుద్ధిగా వినుడు. ద్వైపాయా యను వేదవ్యాసునకు నలువురు శిష్యులుండిరి. 3. గాన క్రమ సహితముగ సామవేదమును జైమినియు సుమంతుడు అథర్వవేదమును ఋగ్వేదమును గాలవుడును, కూశాగ్రబుద్ధి యనునాతడు పదక్రమ సమన్వితముగ యజుర్వేదమును క్రమముగ నభ్యసించిరి. 4.





## ద్వితీయోऽధ్యాయః

గానక్రమసమాయుక్తం సామవేదంతు జైమినిః
అధర్వాణం సుమంతుస్తు ఋగ్వేదం గాలవఃక్రమాత్ 4
కుశాగ్రధీ ర్యజుర్వేదం పదక్రమ సమన్వతం
ఔద్గాత్రం సామభిర్యాగే బ్రాహ్మ మాధర్వణేనతు. 5
హౌత్రమృగ్భిర్యజుర్మం త్రైరాధ్వర్యవ మకారయత్
సుకర్మా జైమినేశ్శిష్య స్సామవేదం మహార్ణవం 6
విభజ్య దశధా చైవం దశ శిష్యానగాపయత్
హిరణ్యానాభః కౌసల్యః పుష్పజిల్లాంగజిద్గుహః 7
లోకాక్షః కౌసలిశ్శంభుస్సుచరశ్చ వృషావహః
సుకర్మణ స్త్విమేశిష్యా దశ సామాబ్ధి పారగాః 8

---

మాదిసంహితాచరణవ్యూహాది మతేభ్యో విలక్షణం భాతీత్యయ మన్యపరఃప్రకార ఇవగమ్యతే. 1.9. అధర్వాణం పార్వణం మహార్ణవం ఇత్యనుషజ్యతే. సుమంతుర్వాహయామాసజ గ్రాహేత్యర్థః స్వార్థేణిచ్. తుర్భిన్నక్రమః సతు సుమంతుస్తమధర్వవేదం పునః పంచధాకృత్య

---

మరియు యాగమునునందు సామవేదమంత్రములచే నౌద్గాత్రమును, అధర్వణమంత్రములచే బ్రాహ్మమును, ఋఙ్మంత్రములచే హౌత్రమును, యజుర్మంత్రములచే నాధ్వర్యమును కల్పించెను. యాగమునందా యావేద మంత్రముల కాయాపేర్లతో వ్యవహారము కల్పింపబడెనని భావము. 5. జైమిని యొక్క శిష్యుడగు సుశర్మ యనునాతడు మహార్ణవ తుల్యమగు సామవేదమును పది విధములుగ విభజించి పదిమంది శిష్యుల నధ్యయనము జేయించెను. హిరణ్యానాభుడు కౌసల్యుడు, పుష్పజిత్తు, లాంగజిత్తు,గుహుడు, లోకాక్షి, కౌసలి, శంభుడు, సుచరుడు, వృషావహుడు అను నీపదుగురే యాసుశర్మయొక్క శిష్యులును సామవేద మహార్ణవమున పారంగతులైనవారును అయియున్నారు. 8. ఈపదిమందియు తమ తమ సంహితను నూరుగా విభజించి క్రమముగా నొక్క రొక్కరు నూర్గురు నూర్గురు శిష్యుల కాయాపేర్లుగల వేదభాగము నుపదేశించిరి. అట్లు ఈ సామవేదమును వేయిశాఖలు కలదని బుధులెరింగియున్నారు. 9. అధర్వ వేదమను మహార్ణవమును సుమంతుడధ్యయనము జేసెనని పూర్వము

తే చాపి శతధాకృత్వా స్వాం స్వాం చైవతు సంహితాం
అధ్యాపయన్ దశదశ పునర్నామాదికా న్మునీన్ 9
అత స్సహస్ర శాఖంతు సామవేదం విదుర్బుధాః
అధర్వాణం సుమంతుస్తు గ్రాహయామాస పార్వణం 10
సంబంధం దేవదర్శ మపిం బ్రహ్మబలిం ధ్రువం
పంచైతాన్ గ్రాహయామాస పంచధాకృత్యతం పునః 11
తేచస్వాం స్వాంద్విధాకృత్య ద్వాభ్యాం ద్వాభ్యాంతుసంహితాం
దదుశ్శుల్కాయనాదిభ్యో మునిభ్యశ్చ యథాక్రమం 12
శుల్కాయనః పిప్పలాదో జాబాలిః కుముదోఽంజనః
శౌనక స్సైంధవో వ్యక్షో ముంజకేశ స్తపోబలః 13
సంబంధాదిక పంచానాం శిష్యౌ ద్వౌ ద్వౌ సమీరితౌ
ఇత్యధర్వణభేదాశ్చ దశధాదౌ సమీరితాః 14

ఏతాన్ సంబంధాదీన్ పంచశిష్యాన్ గ్రాహయామాస అధ్యాపయామాస. ప్రథమగ్రాహయామాసస్తు సిద్దస్యానువాదః 10.15. ధీమాన్ సుతీక్ష్ణరితి ద్వేవిశేషణవాచకపదే ఆధ్యయనేఽధ్యాపనే చైతయోర్వినియోగో ద్రష్టవ్య. 16. బాష్కలేనాధితం బాష్కలమయంతీత బాష్కలాధ్యాయిన,

చెప్పబడినది. ఆ సుమంతుడు తానధ్యయనముజేసిన సంహితలను రెండు రెండుగ విభజించి క్రమముగ నొక్కొక రిద్దరిద్దరు శిష్యులకొసంగిరి. 12. వారలే శుల్కాయనుడు,పిప్పలాదుడు, జాబాలి, కుముదుడు, అంజనుడు, శౌనకుడు, సైంధవుడు, వ్యక్షుడు, ముంజకేశుడు, తపోధనుడు అనునీ పదుగురును సంబంధుడు మొదలుగాగల ఐదుగురకు జంటలు జంటలుగా నేర్పడిన శిష్యులై యున్నారు. ఈ ప్రకారముగా నాదియం దధర్వణ వేదము యొక్క భేదములు పదియని చెప్పబడినవి. 14. ఈ పదింటియొక్క భేదములు, ఉపభేదములును అనేకములై యున్నవని పెద్దలు చెప్పుచున్నారు. 14. మరియు ధీమంతుడగు గాలవుడును తానధ్యయనము చేసిన ఋగ్వేదమును రెండుగ విభజించి బాష్కలుడు, శాకలుడను నిరువురు మహరుల కుపదేశించెను. వార లిరువురును క్రమముగ తమ

తాసాం భేదోపభేదాశ్చ బహవస్సద్భిరీరితాః
ఋగ్వేదం గాలవోధీమాన్ ద్విధాకృత్య సుతీక్ష్ణధీః 15
మునిభ్యాం ప్రదదౌద్వాభ్యాం బాష్కలాయ శాకలాయచ
తౌచాపి సంహితాం స్వాం స్వాం చతుర్ధా దదతుః క్రమాత్. 16
సుధర్మా సుకవాన్ ప్రజ్ఞో వల్కలశ్చ మహర్షయః
చత్వారో బాష్కలశిష్యా బాష్కలాధ్యాయినో ద్విజాః 17
సుధర్మా మారకో దండో ముద్గలశ్చ మహర్షయః
చత్వార శ్శాకలశిష్యా శ్శాకలాధ్యాయినో ద్విజాః 18
తతస్తు సంహితా స్వాంస్వాం త్రిధాకృత్య మహర్షయః
తే౽త్రిభ్యశ్చ సుధర్మాద్యా ఋక్శాఖాం బ్రువతే బుధాః 19

ఇత్యపి పూర్వవత్ ఉభయత్ర ద్విజా ఇతి సమానాధికరణ విశేషణం జ్ఞానౌత్కృష్ట్యప్రదర్శనార్థ మిదంపదం. 21. తఇమఇతీ ప్రసిద్ధిద్యోతనాయ ద్వయోస్సర్వనామశబ్దయో రుపాదానం 21, 24. యాజుషం వేదం విశేషేణ గృహ్ణంతీతి యాజుషవిగ్రహః. 25. బహుమతః గర్వితః

కుపదేశించిరి. 16. సుధర్ముడు, సుకవుడు, ప్రజ్ఞుడు, వల్కలుడు. నను నీనలువురు మహర్షులు బాష్కలుని శిష్యులై బాష్కలశాఖ నధ్యయనముజేసిరి. 17, సుధర్ముడు, మారకుడు, దండుడు, ముద్గలుడు, అనునీమహర్షులు నలువురును, శాకలుని శిష్యులై శాకలశాఖనధ్యయనము జేశినవారలైరి. 18, సుధర్ముడు మొదలుగాగల యీయెనిమిది మందిమహర్షులును తమ తమ సంహితను మూడుమూడు విధములుగ విభజించి ముగ్గురు ముగ్గురు ఋషులకు ప్రత్యేక మీఋక్శాఖ నుపదేశించిరి. 16. శాలేయుడు, సుత పసుడు, వత్సుడు, ముద్గుడు, గోముఖుడు, పిప్పలుడు, పలింగుడు, గోముఖుడు, మంతుడు, కకుషుడు, ఉగ్రతపసుడు, శిఖిసుబహుడు, మృదులుడు, అనంతుడు, కుండిలుడు, అక్షరథుడు, తపుడు, పురాణుడు, ప్రదులుడు, సర్గుడు, వాయుకుడు, కపిలుడు, శిధియను నీయిరువది నల్వురును సుధర్ముడా దిగాగల యెనిమిది మందికిని శిష్యులైయున్నారు. 21. యీయిరువది నలువురే యిరువది నాల్గువిధములై యొప్పిన ఋక్శాఖనధ్యయనము జేసిరి, 22. వీని

శాలేయస్సుతపావత్సో ముద్గో గోముఖ పిప్పలౌ
పలింగు ర్గోముఖో మంతుః కకూరుగ్రత పాశ్శిఖీ, 20
సుబహూర్మృదులోనంతః కుండిలో క్షరథన్తపః
పురాణః ప్రదులస్సర్గో వాయుకః కపిల శ్శిథిః 21
సుధర్మాదికశిష్యాస్తే చతుర్వింశతికా స్త్విమే
తే చతుర్వింశతి విధా మృక్ఛాఖాం బ్రువతే బుధాః 22
తస్యాభేదోప భేదాశ్చ బహవ స్సద్భిరీరితాః
తతః కుశాగ్రధీర్ధీమాన్ యజుర్వేదం మహార్ణవం. 23
విభజ్య పంచధైవాథ మునీన్ పంచమహాధియః
సాంగ మధ్యాపయామాస యాజ్ఞవల్క్యాదికాన్ గురుః. 24
యాజ్ఞవల్క్య స్సువర్ణశ్చ జాబాలిర్ద్వైదిక స్సుహృత్
కుశబుద్ధే రిమే శిష్యాః పంచ యాజుషవిగ్రహాః 25
తతోబహుమతాత్మానం యాజ్ఞవల్క్యం తపోబలాత్
శిష్యంతు కృతసచ్ఛాస్త్ర మవిషహ్యం కుశాగ్రధీః 26
ఉవాచ పరయావాచా క్రుద్ధో వేదో విముచ్యతాం
మత్తోధీతో యజుర్వేద ఇత్యేతచ్ఛ్రుతవాన్మునిః. 27

ఆత్మాయేననః బహుమతాత్మా. 26. పరయా హృదయస్పృశా. వేదో యజుర్వేద ఇతి క్రోధే ద్విరుక్తః, 27. స్వరూపమివ యథాపూర్వమివ యథాధీత మన్యూనా నతిరిక్త మిత్యర్థః. 28 తిత్తిరిణో రూపం ధరతీతి తిత్తిరిరూపధృత్. 26. యజూంషివాంతాని తాన్యుద్దిశ్య పూర్వమధీతానాం వాంతత్వా దద్య నూతనానామ పేక్షితత్వాచ్ఛతేషాశాంసంపాదనే విలాప హేతురుచ్యతే అవిషహ్యాశక్తే ర్యాజ్ఞవల్క్యన్య వాంతకుశాగ్రధీవేదన్య స్వవిమాననాకర పూర్వగురుమాత్సర్యాభినివిష్టస్య తేషామేవ యజుషాం పున రవిలంబేన సంపాదనేచ్ఛాయాం

భేదోపభేదములనేకములని పెద్దలు చెప్పుచున్నారు. ఆవల బుద్ధిశాలి యగు కుశాగ్రధీయను నాతడును తానధ్యయనము జేసిన యజుర్వేద మహార్ణవమును ఐదుగ విభజించి యాజ్ఞవల్క్యుడు మొదలుగాగల మహాబుద్ధిశాలురగు నైదుగురు మహర్షులకు స్వయముగ సాంగముగ నావేదము నుపదేశించెను. 24. యాజ్ఞవల్క్యుడు, సువర్ణుడు, జాబాలి,

నారాయణః పితాయస్య మాతాయస్య చ తత్ప్రియాః
భృగ్వాదిమునయశ్శిష్యా స్తస్తై విఖనసేనమః 37
ఇత్యుక్త్వాదౌమునింలోకే తథా సూత్రం చ తత్కృతం
అఖిలేష్వపికార్యేషు ప్రణమేయుః ఫలార్థినః 38
సూత్రేణానేన శాస్త్రేణ సంస్కృతా దీక్షితాశ్చయే
వైకుంఠేతు మహాలేకే విహరంతి నసంశయః 39
వైష్ణవం శాస్త్రమేతద్ధి పురా విష్ణుముఖోద్ధితం.

అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా. ఇతి సమస్తాశ్శక్తయశ్చైతాన్నపయత్రప్రతిష్ఠితాః తద్విశ్వరూప వైరూప్యంరూపమన్యద్ధరేర్మహత్ సమస్త శక్తి రూపాణి తత్కరోతి మహేశ్వర, దేవతిర్యఙ్మనుష్యాఖ్యా చేష్టావంతి స్వలీలయేత్యాదిభగవతాపరాశ రేణచోక్తం, ఏషుసర్వేషు భగవతో విగ్రహేషు సాంసారిక ఫలప్రదాన ఏవమాత్రయా తారతమ్యం నిశ్శ్రేయసంతు వ్యాప కానుసంధాయినాం సర్వత్ర హస్తాపభేయం అలమియతాతస్య శ్రియా సహదాంపత్యంచ నిత్యం తత్తద్వ్యూహాద్యనురూపాశ్చ లక్ష్మ్యాది .వ్యూహాదయ శ్శాస్త్రేషు ప్రతిపాదితాః వ్యూహాదిషుమిథో௨ంగాంగి భావాదికం స్వసంకల్ప మాత్రాయత్తం ఈశ్వరస్య సర్వత్రైకత్వాత్ యత్తు యంత్ర విశేషాదిషులక్ష్మీ సుదర్శనాదీన్ ప్రతి వాసుదేవాదేరంగత్వం క్వచిత్క్వచి త్ప్రతిపాద్యతే తత్ర యధా వస్థిత బ్రహ్మాత్మకత్వానుసంధానేన స్వాత్మానం ప్రత్యేవ స్వస్మై

విచ్ఛిన్నమగు సంతానములవారికి సభ్యాగ్నియు వేదాధ్యయనంబును సిద్ధింపజేయునట్టి మహిమము గలిగియున్నది. 19. గ్రామార్చనములేని గ్రామమందు గృహార్చనము సైతము ఫలవంతము కాజాలదు. వృక్షము యొక్క వ్రేళ్ళు తెగిపోయినవెనుక దాని మొదటికిగాని శాఖలకుగాని చేసిన యుదకసేచన ముపయోగమెట్లు కాజాలదో గ్రామముననే శక్తినశించినపుడు తదేకదేశంబగు గృహంబునకే యలంకారము జేసినను ప్రయోజనకారి కాజాలదు. 20. ఓ మహర్షులారా! అర్చావతారముగ భగవానుడవతరించెడి స్థానవిశేషంబుల నైదింటిని వివరించెద సావధానులరై యాలకింపుడు. 21. దైవము, ఆర్షము, పౌరాణము, మానుషము, స్వయంవ్యక్తమని యీ భూలోకము నందర్చావతారము యొక్క స్థానభేదంబులైయున్నవి. 22. దేవత (అనగా బ్రహ్మేంద్రాదు) లవలన ప్రతిష్ఠింపబడినవి దైవములను (మరీచ్యాది) మహర్షులచే ప్రతిష్ఠించబడినవి. యార్షములనియు, నిట్లుగాక

విఖనోమునయే పూర్వం శాస్త్రం భగవతేరితం
తస్మాత్తద్భగవచ్ఛాస్త్రం లోకే వైఖానసంస్మృతం, 40
తథా భగవతైవోక్తం పంచరాత్రం పృథక్ పృథక్
తంత్రవేద ప్రసిద్ధత్వా దవైదిక మితీరితితం. 41
బౌద్ధంమార్హతక్యం చైవ శైవం పాశుపతం తథా
కాపాలం పంచ రాత్రంచ షడేతే సమయాస్స్మృతాః 42

---

చ్చమంగత్వమితి నవిరోధః, బ్రహ్మదృష్ట్యానుసంధానేతు తత్తత్ఫలవిశేషార్థంతదంగక త్వేనప్రాధాన్య దృష్టిరితి త్రయ్యంతోదితదృష్టివిధ్యంతరేష్వివనతత్త్వ వ్యవస్థాభంగః. ఇత్యాదిద్రష్టవ్యం. శ్రీమద్దేశికాదీనాం శ్రీసూక్తిషు. ఆనందసంహితాయా మస్యాంచ ప్రథమా ధ్యాయే దశమశ్లోకమారభ్య పరస్వరూపముక్తం ద్రష్టవ్యంతమేవార్చావతారం ప్రస్తౌత్యర్చేతి. 16,17.వాస్తుగ్రామః తదంగఆలయే. 18. వేదస్స్వాధ్యాయః, వేదీయాగః. (వేదిరిత్యుచితం) యస్య వేదశ్చ వేదీచ విచ్ఛి ద్యేతే త్రిపూరుషమితితద్విహీనస్య వ్రాత్యత్వస్మరణాత్, తదర్చనం 'యజ్ఞేషు విహీనం తత్సంపూర్ణం భవ' తీ తివత్సభ్యాగ్ని ర్వేదశ్చ భవతీత్యర్థః. 19. వృక్షస్యేతి స్కంధస్య శాఖానాం చేత్యర్థః. 20. స్థానపంచక మిత్యర్చావతా రాభివ్యక్తి

లక్ష్యజన్మంబులై పురాణకాలము నాటనుండి ప్రాశస్త్యము నందు వచ్చు చుండునవి పౌరాణంబులనియు భక్తిశ్రద్ధాళువులగు మనుష్యమాత్రులచే ప్రతిష్ఠింప బడినవి మానుషంబులనియు పిలువబడుచున్నవి. 23. భక్తుల నను గ్రహింప నిచ్ఛగలిగి నిర్వ్యాజమగు కరుణా విశేషంబున భగవానుడేయే పుణ్యప్రదేశములందు స్వసంకల్పముచే యావిర్భవించునో ఆపుణ్యప్రదేశము స్వయంవ్యక్తమనంబడు నట్టి స్వయంవ్యక్తార్చా రూపము సర్వలోక సమృద్ధిదము. 24. దీనినే దివ్యక్షేత్రంబనియు మహాక్షేత్రంబనియు గూడ పిలుచుచున్నారు. ఇయ్యది స్వయంవ్యక్తం బగుటంజేసియే సర్వక్షేత్రం బులలో నుత్తమమైనది. 25. మానుషస్థలము యోజనదూరంబును దైవతము దశయోజనంబును, అర్షమైదు యోజనంబులును పౌరాణము యోజన త్రయంబును తానుండు ప్రదేశము నావరించి పవిత్రము జేయును. 26. స్వయంవ్యక్త స్థలమందలి దేవుడు సర్వలోక శుభప్రదుండని చెప్పబడినది. 27. భగవానుడెచ్చట నర్చారూపియై యుండునో ఆయా యెడల నెల్లను

సమయే నార్చనం యత్ర జన్మాంతర ఫలప్రదం·
వైదికేనార్చనం యత్ర తజ్జన్మన్యేవ ముక్తిదం. 43

చతుర్భుజధరో భూత్వా శంఖచక్రధర స్తథా
గగనే గరుడారూఢో విష్ణోః పార్షదతాం వ్రజేత్. 44

తస్మాద్వైఖానసార్చాయాం బద్ధాంజలి పుటా నరాః
భక్తి యుక్తాః ప్రవర్తేర న్నద్యోముక్తి ఫలార్ధినః 45

సమయార్చన కృద్భూమౌ తనుమన్యాం సమాశ్రితః
వైదికేనార్చనం కృత్వా దేహాంతే మోక్షమాప్నుయాత్. 46

స్థాన పంచక మిత్యర్థః. 21.23. భక్తానుకంపయేతి అంభస్యపారే భువనస్య మధ్యేనాకస్య పృష్ఠే మహతో మహీయాన్ ఇతి శ్రుత్యుక్తవత్ అస్యార్థః, అపారే అంభసి మహార్ణవే, భువనస్య మధ్యే శ్రీ వేంకటాద్రౌ నాకస్య పృష్ఠే పరమపదే చ మహతో మహీయాన్ పరమపురుషోవర్తత ఇత్యర్థః. తథో చ్యతే వారాహీచ. అంభస్యపారె భువనస్య మధ్యే నాకస్య పృష్టే భువివేంకటాద్రౌ వితీత్యాది భాష్యకారై రుక్తం. 24, 26. స్వయంవ్యక్తే త్యతఃపూర్వం 'పునాతి, దేశమఖిల ముక్తం స్థలచతుష్టయ మిత్యర్థకం వాక్యం త్రుటితంస్యాత్, 27. వైఖానసార్చనం ప్రస్తౌతి యత్ర యత్రేతి, యథా శైలే సుప్రగే సహస్ర భూసురాదూర్ధ్వే గ్రామే బ్రహ్మాంకణేషుచ వైఖానసేన సూత్రేణ నిషేకాది సు సంస్కృతైః భార్గవాది మహా తంత్ర మంత్ర భేద విచక్షణైః, అనుద్ధృతైర్మంత్రగణై ర్వేద వేదాంత

---

వైఖానసుల చేతనే యారాధనము చేయబడదగినది. ఇట్టివారు సంభవించనపుడు తాంత్రికారాధనమైనను చేయదగును. (ఆరాధనము యేరీతిన యినను చేసియే తీరవలయునని ప్రధమశ్లోకమందు చెప్పబడినది.) 29. విఖనసు నిచే చెప్పబడిన సూత్రమునందలి సంస్కారములచే సంస్కరింప బడిన వారలు వైదికులన బడుదురు. వీరలు పంచకాలపరులును సర్వకాల సర్వావస్థల యందును భగవంతుని నాశ్రయించిన వారలును అగు చున్నారు. 30. కాత్యాయన మహర్షిచే ప్రణీతంబగు సూత్రమునందలి సంస్కారములచే సంస్కరింపబడి పంచరాత్ర శాస్త్రముచే దీక్షను బొందిన వారలు తాంత్రికు లనబడుదురు. 31. వైఖానస కాత్యాయన సూత్రములచే గాక తక్కిన సూత్రములచే సంస్కరింపబడినవారలు వైదికులుగాని తాంత్రికులుగాని కాజాలరు. ఈ యిరువురును వైఖానస

బ్రాహ్మణా ముఖజాః ప్రోక్తా బాహుజాః క్షత్రియాస్స్మృతా. 47
ఊరుజాః కథితావైశ్యాః పజ్జాశ్శూద్రాస్స్మృతాబుధైః
బ్రాహ్మణాః క్షత్రియావైశ్యాస్త్రయో వర్ణాద్విజాతయః 48
విప్రాఖ్యయా తథైవోక్తా వేద సంస్కార సంస్కృతాః
భూసురో ప్యగ్రజన్మేతి బ్రాహ్మణః పరికీర్తితః 49
శూద్రోప్యవరవర్ణశ్చ వేద సంస్కార వర్జితః. 50
సాంకర్యేణ సముత్పన్నా స్సంకరాః పరికీర్తితాః
సవర్ణేన సవర్ణాయా ముత్పన్నో బ్రహ్మణ స్స్మృతః 51
క్షత్రియశ్చ తథావైశ్య శ్శూద్రశ్చ పరికీర్తితః
తాదృగ్విధి మతి క్రమ్య జాతా స్సంకరజా స్స్మృతాః 52
ఉత్పత్తి స్సంకరాణాం చ వృత్తి రాఖ్యాతథైవచ
సూత్రేపి గురుణాప్రోక్తా తథైవ భృగుణోదితా 53
సర్వే సంకరజాశ్చైవ శూద్రాశ్చాపి ద్విజాస్త్రియః
కృతే త్రేతాయుగే వాపి ద్వాపరే పి కలౌ యుగే 54

పారగైః, క్రమాధ్యయన సంపన్నై స్సాంగో పాంగై స్సుసంస్కృతైః, పంచమూర్తి ప్రకారేణ ప్రతిష్ఠా ప్యార్చయేద్ధరిం వైదికం తదితి ప్రోక్తం రాజరాష్ట్రాభివర్ధన మితి కారణే బ్రహ్మాంశంతు చతుర్భాగంకృత్వావాయవ్య భాగతః పంచమూర్తి క్రమేణైవ విష్ణుం సంస్థాప్యపూజయేత్ ఇతి భీమసంహితాయాం శైవ మేవంమయాఖ్యాతం వైష్ణవంత్వథునోచ్యతే వైష్ణవంచ త్రిధా ప్రోక్తం తథా సమయభేదవత్ పాంచరాత్రం భాగవతం తథా వైఖానసం మతం శుద్ధం మిశ్రం తథా సౌమ్యం యథాసంఖ్యాం క్రమేణతు, వైదికాచార బాహ్యం యత్తద్రౌద్ర మితి కీర్తితం, వైదికాచార సంబంధా దిదంశ్రేష్ఠ ముదాహృతం, గ్రామాదీనాం సమీపేతు మిశ్రోక్తం స్థాపయేద్బుధః అబ్ధి నద్యాది తీరేషు శుద్ధోక్తం స్థాపయేత్తథా, విప్రవాసేషు సర్వేషు సౌమ్యోక్తేనైవ కారయేత్, ఇతి జ్యోతిషే హయగ్రీవ సంహితాయాం శ్రీ శాస్త్రేణైవ కర్తవ్యం గ్రామ మధ్యాలయార్చనం పాంచరాత్ర విధానేన నాచరేదితి శాసనం,

పంచరాత్ర భగవచ్ఛాస్త్రంబుల నధికరించు ముఖ్యాదికారులు కానందున వీరల నర్థబ్రాహ్మణులన బడుచున్నారు. (అధికరించినచోనని భావము) 33. శ్రీవిఖనోమహర్షి కాదియందు భగవానునిచే శ్రీసూత్రముపదేశింపబడినది

ఇహజన్మని దేహాంతే విష్ణుసాయుజ్య కాంక్షిణః
గ్రామే విష్ణుం ప్రతిష్ఠాప్య వైఖానస విధానతః 55

విప్రై ర్వైఖానసై ర్విష్ణోః కారయిత్వార్చనం నరాః
వర్ణాశ్రమఫలం లబ్ధ్వా యాంతి విష్ణోః పరంపదం. 56

తస్మాత్తే భగవత్తుల్యా భగవంతం సమాశ్రితాః.
(సర్వేషామపి వర్ణానాం బ్రాహ్మణో గురురుచ్యతే 57
బ్రాహ్మణానాంచ సర్వేషాం గురు ర్వైఖానసస్స్మృతః)
యేర్చయంతి సదా విష్ణుం న తే ప్రాకృతమానుషాః
జిష్ణులోకాత్పరిభ్రష్టాస్తే దేవా నాత్ర సంశయః 58
ఆశ్రయంతి సదానిత్యం యే వైఖానససూత్రిణం
జిష్ణులోకాది హోత్పన్నా స్తే దేవా నాత్ర సంశయః 59

---

ఇతి కాలనిర్ణయేచ పంచమూర్తి విధానోక్తైర్విష్ణుం సంస్థాప్యచార్చయే దితి హారీతస్మృతౌ, శ్రౌతం మహర్షిభిః ప్రోక్తం వసిష్ఠాద్యైః పురాతనైః, వైఖానసైశ్చ భృగ్వాద్యైస్సనకాద్యైశ్చ యోగిభి రిత్యారభ్య 'శ్రౌతేనైవ హరిం దేవ మర్చయంతి మనీషిణ' మంజర్యాం ఇతి, 28. తాంత్రికైరితి ఉద్ధారపూర్వకో మంత్రో యస్యతాంత్రీక ఉచ్యతే, వినియోగ ప్రధానస్తు యోమంత్రో వైదికస్మృతః ఇత్యుక్తతంత్ర శరణాః తంత్రశబ్ద వ్యపదేశాన్నతాంత్రికత్వం పరంతు యత్రోద్ధృత మంత్రైః ప్రయోగోఽస్తితస్య తాంత్రికత్వం యత్ర వేద మంత్రైః ప్రయోగస్తస్య వైదికత్వం శ్రీవైఖానస శాస్త్రే వేదవాదాంత మంత్రై రేవ ప్రయోగ విధానాత్తు ద్వైదికమేవ నతు తాంత్రిక మితి పురాతంత్ర మిత్యాదౌ తంత్రశబ్ద వ్యపదేశః శ్రీవిఖనస్సూత్ర సూచిత భగవదారాధనస్య తంత్రకృత్య ప్రతిపాదనాత్ ఇత్యాది, వాసాధికారోక్తాం పంచకాలపరాయణత్వం వ్యాచ భ్యామంజర్యాం భాష్యకార ఇతివిస్తరస్తత్రోఽవసేయః. 30, 32. అనర్హా ఇత్యత్రాశుద్ధా ఇతి పాఠః. 33, 34. శ్రౌతేత్య స్యశ్లోకస్య తృతీయా ఆవృత్తిః. 35. అన్యైర్బోధాయనాదిభిః క్లుప్తానాం ప్రణీతానాం సూత్రాణాం నేత్రం నేత్రభూతం యచ్చ తథా స్థిరీకృతం వేద వేదాంగవేదాం తైర్భూయః, ప్రకాశిత స్వప్రామాణ్యం స్థిరశబ్దస్య ప్రకాశోఽర్థః. అన్యథా అభూతతద్భావార్థక చ్వినా విరోధాత్. 36. పితేతి, 'వైఖానసో విఖనసో విఖనాశ్చ విరించనః' ఇతికోశః తథా 'విఖనసాఽర్థితో విశ్వగుప్తయ' ఇతి శ్రీభాగవతం. 37. ఫలార్థినః కర్తారః పుత్రేభ్యో భృగుముఖ్యేభ్యో యధాహ భగవానజ ఇత్యాది, 38. 39. 'వైఖానస ఋషేః పూర్వం

---

గావున భగవానునిచే యుపదేశింప బడుటచే నియ్యది వైఖానస సూత్రమన బడుచున్నది. 34. 2అ 81శ్లో పే 41 చూడుము) 35. ఇతరములగు బోధాయనాది సూత్రముల కన్నిటికిని నేత్ర భూతమైనట్టియు అట్లే

యే నిందంతి మహాత్మానం విఖ్నం వైఖానసం పరం
వేద వేదాంత వేద్యస్య భవంతి మమనిందకాః, 60

ఇత్యుక్తం హరిణా పూర్వం విఖనో మునయే బుధాః
భృగ్వాదీనాం తథాస్మాకం గురుణైవ ప్రబోధితం, 61

వైఖానసాశ్రితాస్సర్వే పాంచరాత్రాశ్రితా అపి
భవేయు ర్వైష్ణవానిత్యం విష్ణు సాయుజ్య కాంక్షిణః 62

విష్ణోర్వాణీ సముద్భవేతో 'యోబ్రహ్మణ' మిత్యాదయస్తత్ర ప్రమాణం. 40.43. ఏవం యః కురుతే భక్త్యాదేహాంతే కృపయాప్రభో రిత్యర్థకం కించిత్త్రుటితం స్యాత్ తతశ్చతుర్భుజ ఇతి. 44.45. సద్యస్తస్మిన్నేవ జన్మని. 46. శ్రీ శాస్త్రస్యా విశేషేణోపాదే యత్వం ప్రశంసితుం వర్ణోత్పత్తిమాహ ముఖేతి. 48.57. విష్ణులోక ఇత్యపిపాఠః, జిష్ణు లోకస్స్వర్గః 'శుచీనాం శ్రీమతాం దేహే యోగభ్రష్టోభి జాయతే, అథవా యోగినామేవ కులే భవతి ధీమ' తా మితి 'నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛ' తీతి భగవ దుక్తత్వాత్. 58. 61. వైఖానసాశ్రితా

---

వేదవేదాంగములచే ప్రకటింప చేయబడిన ప్రామాణ్యా విశేషంబు గల్గి నట్టియు భగవత్కర్మ ప్రతిపాదనార్థంబగు నట్టియు శ్రీవైఖానస సూత్రంబునకు నమస్కరించు చున్నాను. 36. యేమహాను భావునకు శ్రీమన్నారాయణుండే తండ్రియు శ్రీమహాలక్ష్మీ జననియు భృగ్వాది మహర్షులు శిష్యులును అగుచున్నారో అట్టి విఖనోమునిని నమస్కరించుచున్నాను. 37. ఇట్లనియందరును సమస్త కార్యములకు నాదియందు విఖనోమునిని తత్ప్రణీతంబగు శ్రీసూత్రమును నమస్కరించి యాకర్మలనాచరించి తదుక్తఫలంబులనందు చున్నారు. 38. ఈవిధంబగుటచేనీ సూత్రము చేతగాని శాస్త్రముచేతగాని సంస్కరింపబడిన వారలు గాని దీక్షితులుగాని శ్రీవైకుంఠలోకంబు జెందుదురనుటకు సందియములేదు. ఆదియందు శ్రీ మహావిష్ణునిచే యీ శాస్త్రము విఖనోముని కుపదేశింపబడినది. కావున నిది భగవచ్ఛాస్త్రమనియు వైఖానసశాస్త్రమనియు చెప్పబడుచున్నది. 40. ఇట్లే పంచరాత్ర శాస్త్రముగూడ భగవానునిచే వేరుగ జెప్పబడినది. ఇది యుద్ధృతమంత్రంబులచే జేరుటచే తాంత్రికమనియు అవైదికమనియు ననబడును. 42. బౌద్ధము, శైవము, ఆర్హతము, పాశుపతము, కాపాలము, పంచరాత్రము ననునివి యారును సమయము

వైఖానస కులేజాతః ప్రత్యక్ష పరమేశ్వరః
ఆశ్రయేరం స్తతస్తంతు (సర్వే) నారాయణా శ్రితం. 63

ఇతి. 'వైఖానసా ద్యాగమోక్త దీక్షాం ప్రాప్తోహి వైష్ణవ' ఇత్యాది, 62, 63. అస్మిన్నధ్యాయేఽర్చనద్వైవిధ్యం భగవద్విగ్రహ భేదః స్థాన పంచక వివరణం వైదికార్చన మహత్త్వమిత్యంశాః ప్రతిపాదితాః ఆహత్య శ్లోకానాం త్రిషష్టిః త్రుటితపాదౌ గధితౌ కుండలీకృతం సార్ధశ్లోకద్వయం నగ్రధితం.

-

లనబడుచున్నవి. 42. సమయ శాస్త్రంబులచే యర్చించుట జన్మాంతర మందు ముక్తిని గల్పించును. వైదికార్చన మాజన్మ మందే ముక్తినిచ్చును. 43. ఇట్టివారలు దేహావసా నమందు చతుర్భుజములను ధరించి శంఖచక్ర ధారియై గగనమార్గంబున గరుడవాహనము నెక్కి విష్ణుసాయుజ్యంబును జెందుచున్నారలు. 45. కావున వైఖానసార్చనమందు బద్ధాంజలులయిన వారలు ముక్తిజెందు చున్నారు. 46. సమయంబుల చేనయిన యర్చనము జేసి దేహాంతరమును స్వీకరించి యాదేహమందు వైదికార్చనము జేసి యంతట మోక్షార్హులగుదురు. 47. భగవానుని ముఖబాహూరు పాదములనెడి నాలుగు స్థానములనుండి క్రమముగ జననమందినట్టి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు నలువురును నాలుగు వర్ణముల వారలనబడుదురు. 48. ఇందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ముప్పురును ద్విజులనబడుదురు. 49. వేదవిహితంబు లగు సకల సంస్కారంబులచే కూడిన వారలు భూసురులు అగ్రజన్ములు, బ్రాహ్మణులని పిలువబడుదురు. 50. శూద్రుడపరవర్ణుండని వేదసంస్కార వర్జితుడని యుననబడును. 50. సాంకర్యము వలన గలిగినవారలు సంకరు లనబడుచున్నారు. 51. ఆయా వర్ణముల పురుషులచే నాస్త్రీలయందు శాస్త్రీయ సంస్కారంబులచే జనించినట్టి సంతాన మాయా వర్ణముల పేరిట పిలువ బడుచున్నారు. 52, అట్లుశాస్త్రీయమగు దాంపత్య సంబంధము లేక కామచారంబు వలన జనించినవారలు సంకరజాతులన బడుచున్నారు సంకరోత్పత్తియు వారలకు నియమింపబడిన వృత్తియు నామ భేదంబును శ్రీ సూత్రమందా చార్యుల వారిచేతను ఇట్లే భృగ్వాది మహర్షులచేతగూడ విస్తరించి చెప్పబడినందున నాయంశమచట గనం దగును. 53. ఇట్లు బహుప్రకారంబులగు సంకరజాతులును, శూద్రులును ద్విజులందరును, స్త్రీలునుగూడ ఈజన్మమందే (దేహావసానకాలమున) విష్ణుసాయుజ్యమును బొంద

ఇత్యార్షే శ్రీవైఖానసే మరీచిప్రోక్తాయా మానన్ద
సంహితాయాం భగవద్విగ్రహ స్థలపంచక
వైదిక తాంత్రికార్చనక్రమ నిర్ణయో
నామ చతుర్దశోఽధ్యాయః.

---

నిశ్చయింతురేని వారలు నివసించియుండు గ్రామమున వైఖానస విధానంబుగ విష్ణుని ప్రతిష్ఠచేయించి వైఖానసుల చేత నా విష్ణునారాధింప జేసినచో తమ తమ వర్ణాశ్రమ ఫలంబులనన్నిటిని పొందుటయేగాక దేహావసానమందు శ్రీమహావిష్ణుని పరమపదంబు నలంకరింతురు. కృతత్రేతాది చతుర్యుగంబులలో గూడ నిట్టి యర్చావిధానమే మోక్ష,సాధనమై యున్నది. 56. ఇట్టి మహత్త్యమర్చన మందుండుటచేత నాభగవంతు నాశ్రయించిన వారలు భగవత్తుల్యులగుచున్నారు. 57. సర్వకాల సర్వావ్యవస్థల యందును, శ్రౌతస్మార్తాది కర్మల యందును విష్ణునే యేల్లపుడారాదించు వారలు సామాన్యమనుష్య భావంబున చూడదగిన వారలు కాదు. స్వర్గలోకమునుండి క్షీణపుణ్యులై యవతరించిన దేవతలే యగుదురు. 58. మరియు నిట్లే వైఖానసుల నాశ్రయించునట్టి భక్తులును దేవతలేయనుటయు నిర్వివాదము. 59. ఎవ్వరు వైఖానసులను నిందింతురో వారలు వేద వేదాంత వేద్యుడగు నన్ను నిందించిన వారలగుచున్నారు. 60. ఈ విధముగ భగవానునిచే ఆచార్యుల వారికి చెప్పబడినది. దానినే ఆచార్యుల వారు మాబోటిశిష్యకోటి కుపదేశించిరి. ('సబ్రహ్మ విద్యాం సర్వ విద్యా ప్రతిష్టామథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ' యని యుపనిషత్తు చెప్పుచున్నది. అథర్వయనగా భృగువు.) 61. వైఖానస పంచరాత్ర శాస్త్రముల రెంటిలోనే యొక్కటిని గాని యాశ్రయించి విష్ణు సాయుజ్యకాంక్షులగు భక్తులు వైష్ణవులగుచున్నారు. 62. వైఖానసవంశమం దుదయించిన మాత్రముననాతడు ప్రత్యక్ష పరమేశ్వరుడగుచున్నాడు, కావున భగవద్భక్తులందరును వైఖానసు నాశ్రయించి మోక్షము నందుదురు.

ఇది యార్షమగు శ్రీవైఖానస శాస్త్రమున మరీచి ప్రోక్తమగు నానంద సంహిత యందు స్వార్థ పరార్థార్చనము, పరవ్యూహాది భగవద్విగ్రహ భేదము స్థలపంచక వివరణము వైదిక తాంత్రికార్చనా తారతమ్యము, వైదికార్చన శ్రైష్ఠ్యమునునంశములుగల చతుర్దశాధ్యాయము సంపూర్ణము.

శ్రియైనమః
శ్రీశ్రీనివాస పరబ్రహ్మణేనమః
శ్రీమద్విఖనస మహాగురవే నమః

శ్రీవైఖానసీయా

# మరీచిప్రోక్తా ఆనన్దసంహితా

## అథ పంచదశోऽధ్యాయః

## విఖనసోత్పత్తి

పునర్వ్యస్సంప్రవక్ష్యామి సంభవం విఖనోమునేః
శ్రుణ్వతాం సర్వపాపఘ్నం సాక్షాన్మోక్షప్రదం శుభం, 1
సర్వాభీష్టప్రదం పుణ్యం శ్రుణుధ్వం సువ్రతాదయః
ప్రళయానంతరం సాక్షాత్పురుషః ప్రకృతేః పరః 2
కారణాబ్ధిజలే విష్ణుర్యోగ నిద్రావశంగతః
ద్విలక్షార్ధ ప్రమాణేన శయానః ప్రభురవ్యయః 3

---

అథ ప్రసంగాదీదృశ మహామహిమ చ్ఛీ శాస్త్ర ప్రణేతుర్భగవతో మహర్షేర్జన్మ విస్తరం వక్తు ముపక్రమతే పునరితి. పూర్వం చతుర్థాధ్యాయే శ్రీశుకనారద సంవాద పారత్వేన 'అథ సస్మారే' త్యాది నాऽధ్యాయాంతేన విఖనసోత్పత్తి రుక్తే త్యత ఆదరాతిశయాద్భూయః కథయామి త్యాహపునరతీత్యర్థః యద్వాభగవతోऽవతారస్య బహ్వీభ్య శ్రుతిభ్యో బహుధా ప్రతిపాదనాత్ తాసాంకల్పాంతరత్వేన విషయ వైవిధ్య దర్శనాయాహ పునరితీత్యాద్యూహ్యాం, విస్తరస్తూత్తరత్ర వక్ష్యతే. భగవత్కథానాం మోక్షప్రదత్వం ప్రసిద్ధం. 14. ప్రలయాన న్తరమితి. ఏకదా ప్రలయకాలే భుజంగపతిభోగపర్యంకశయితస్య నారాయణస్య నాభికమలే బ్రహ్మోద్భవః భగవదంశ భూతశ్చతుర్ముఖో జగత్సర్వం సృజతీతి విజ్ఞాయత ఇతి విమానార్చనకల్పే మరీచిః. (81 పటలం) తథా 'అనిరుద్ధాంశజశ్శ్రీమాన్ పద్మనాభః పురాతనః సంహృత్యలోకాన్ పురుషో నాగపర్యంక మేయివాన్ తత్ర పుంసశ్శయానస్య నాగ పర్యంకభూషితే హిరణ్మయం పద్మగర్భం నాభేరండమ జాయతేతి

---

పూర్వమందు నాల్గవయధ్యాయములో విఖనసుని యుత్పత్తి ప్రకారం బుపదేశింప బడియు నాదరాతిశయంబున నీ యధ్యాయము మొదలు తిరిగి యా విఖనసుని యుత్పత్తియు చరిత్రంబును సవిస్తరంబుగ జెప్ప బడుచున్నవి. ఓ సువ్రతాదులగు మహనీయులారా! తిరిగి మరియొక

పాద్మే (3అ.) తథా 'నారాయణోఽసృజత్తోయం తత్రైవా సీన్మహార్ణవః శయానస్య తథా పద్మమభూన్నాభ్యాంపురందర హృషీకేశస్స భగవాన్ పద్మయా సహవిద్యయా అప్సు సంశయనం చక్రే యోగనిద్రావశంగతం, యాసాప్రోక్తా మహాకాళీ సాన్నిద్రాతా మసీహ్యా భూత్' ఇతి చాత్రైవ ప్రకృతేరితి. ఇదముక్తం భవతి. అత్రాశేష చిదచిత్ప్రకారకం బ్రహ్మ ప్రమేయం, తదన్తర్గతం చ సర్వం ద్కవ్యాద్రవ్యాత్మనా విభజ్యతె ఉపాదానం ద్రవ్యమతథా భూతమద్రవ్యమితి చ తల్లక్షణం, అవస్థాశ్రయ ఉపాదాన సంయోగరహి తమ ద్రవ్యం ద్రవ్యంచ బహుధా విభక్తం. 'ద్వేధా జడాజడతయా ప్రత్యక్తదితంతయాపివా ద్రవ్యం షోఢా త్రిగుణానేహోజీవేశ్వర భోగభూతి మతి భేదాత్. ధీ కాలభోగభూతీరవి వక్షిత్వా గుణాది రూపత్వాత్, దేహాత్మే శభిదార్థం త్రేధా తత్త్వం వివించతే కేచిత్' ఇత్యాదినా ప్రకారాన్తరా దృశ్యన్తే యథా జడమజడం చేతి ప్రత్యక్పరాక్చేతి త్రిగుణకాల జీవేశ్వర శుద్ధసత్త్వ ధర్మభూతజ్ఞానానీతి ద్రవ్య స్యైవం షడ్విధత్వే చిదచిదీశ్వరభేదేన త్రేధా విబాగః కేషాం చిత్ స్పష్ట ప్రతిపత్త్యర్థమితి సమాధత్తేధికాలేతి చిదచిదీశ్వర తత్త్వత్రయ నిరూపణస్యైవ దేహాత్మ భ్రమస్వతంత్రాత్మభ్రమ నివర్తకతయాఽత్యంతా వశ్యకత్వాద్ధర్మ భూతజ్ఞానస్య జ్ఞానాశ్రయరూప చేతసతయా నిత్య విభూతేర్విగ్రహాదిరూపేణేశ్వర విశేషణతయా

తీరున శ్రీ విఖనోమునీంద్రుని యుత్పత్తి నెఱగించుచున్నాను. ఇయ్యది వినువారలకు సర్వపాపంబులను బోనడుచు నదియు సాక్షాత్తుగ మోక్షము నిచ్చునట్టిదియు శుభంబును సర్వాభీష్ట ప్రదంబును పుణ్యంబునగు గావున మీరలు దీనిని మిక్కిలి యవధానంబు గలిగి నినుడు 14. ఒకానొక ప్రళయమున కనంతరము ప్రకృతికంటె పరుండగు సాక్షాత్పరమపురుషుడగు విష్ణుండు కారణంబులగు నబ్ధిజలంబు లందు యోగనిద్రావశంగతుడై ద్విలక్షార్ధప్రమాణంబున శయనించి యుండెను.

ఇందలి సంగ్రహంబీతీరుగ జెప్పనగును. అశేషంబులగు చేతనా చేతనంబును ప్రకారంబుగ గలిగిన పరబ్రహ్మము ప్రమేయమగు చున్నది. అందంతర్గతంబై యున్న సమస్తంబును ద్రవ్యము అ ద్రవ్యము అని రెండుగ విభజింప దగియున్నది. ఉపాదానంబగు దానిని ద్రవ్యమనియు తద్భిన్నమగు దాని నద్రవ్యమనియు చెప్పవచ్చును. ఉపాదానమనిన నవస్థాశ్రయంబని భావము. అద్రవ్యము సంయోగ రహితమైనది. ఇందు మొదటిదగు ద్రవ్యము బహువిధములుగ విభజింపబడినది. జడము, అజడము అనియు, ప్రత్యక్కు, పరాక్కు అనియు, త్రిగుణము, కాలము, జీవుడు, ఈశ్వరుడు, శుద్ధసత్త్వము, ధర్మభూతజ్ఞానము అనియు సంగ్రహముగ నిందలి విభాగవిశేషంబుల జెప్పవచ్చును. అందు త్రిగుణాది భేదంబున నారుగా విభజింపబడిన ద్రవ్యమునందు ధర్మభూతజ్ఞానంబును

కాలస్య తత్త్వత్రయ విశేషణతయా ప్రతీయమానత్వా ద్దేహాత్మ భ్రమస్వతంత్రాత్మ భ్రమ నివృత్త్యనుపయోగిత్వాచ్చ తత్వత్రయ నిరూపణమేవ కేషాంచిత్సమ్మతమితి భావః. అద్రవ్యం పునస్సత్త్వరజస్తమాంసి శబ్దాదయః పంచ సంయోగశ్శక్తిరితి దశధా విభజ్యతే. తదేవ త్రిగుణం ప్రకృతిః రజోగుణకం తమోగుణకం మదాద్యాశ్రయత్వ మితివాతల్లక్షణం. తచ్చహ విచిత్రసృష్ట్యుపకరణత్వాన్మాయా ప్రోచ్యతే. వికారానస్యాః ప్రకరోతీత్య పాదానేక్తిన్ ప్రత్యయాంతత్వేన వ్యుత్పాద్యతే ప్రకృతిరితి. విద్యావిరోధాదిభిరవిద్యాదిశ్చోచ్యతే. తచ్చ సమ విషయ వికారసంతానాంశ్చ కాలభాగ భేదాభ్యా మారభతే. ఇదం చ పరిస్పందాది యోగ్యభూతేంద్రియ పరిణామదశాయామపి నిశ్ఛిద్రమే తత ఏవ హి స్వకార్యవ్యాపకత్వం ద్వయోరన్య తరస్య వాస్పర్శ శూన్యత్వేన న సప్రతిఘత్వ విరోధః వాయ్వాదిభూత చతుష్టయం హి స్పర్శవదస్పర్శే నాకాశేన వ్యాప్తం, ఇదమేవ త్రిగుణం పూర్వావస్థోప మర్దకావస్థాభేదాచ్చతుర్వింశతి తత్త్వాని మూల ప్రకృతిర్మహానహంకార ఇంద్రియాణ్యేకాదశ పంచ తన్మాత్రాణి పంచభూతాని చేతి. నన్వేకస్య బహుధావ స్థిత విశ్వాత్మనా పరిణామః ఏకస్యైవ మృత్పిండస్య ఘటశరావాది రూపేణేవేతిచేన్న. నిరవయవే తధానుపపత్తేః నావయ వత్వే వాబహూనామేవ బహుధా పరిణామ ప్రసంగాత్. తధా చ గతమేకో పాదానవదేన. సా చ సమత్రైగుణ్యా మూలప్రకృతిః. తస్యామపి మాత్రయాభేద మలంబ్య అవ్యక్తాక్షర విభక్తావిభక్త తమోరూపావస్థా చతుష్టయమామనన్తి మహర్షయః. తత్రాహం కారత్వా వస్థాऽవ్యవహిత పూర్వావస్థావ త్రిగుణం మహాన్ సత్రిధా, సాత్త్వికో రాజసస్తా మసశ్చేతి. తత్ర తత్తద్గుణోన్మేషవశా దంశభేదాత్తత్త ద్వ్యపదేశః ఇంద్రియత్వా వస్థాऽవ్యవహిత పూర్వావస్థా విశిష్టం త్రిగుణ మహంకారః. సోపి పూర్వవత్త్రివిధః. తత్ర సాత్త్వికాదింద్రియాణి తామసాచ్ఛబ్దతన్మాత్రం రాజస ఉభయాను గ్రాహకః ప్రాణాద్యన్యత్వే సతి హృత్కంఠ చక్షురాదిశరీర ప్రదేశ విశేషావచ్ఛిన్న వ్యాపారతయా తత్తత్కార్య విశేష శక్త మింద్రియం, తచ్చ ద్విధాప్రాకృతమ ప్రాకృతమితి శుద్ధాశుద్ధయోగాదేస్తుద్భేదః (అవ్యక్తమహ దహంకారేష్వపి ప్రాకృతా ప్రాకృతా విభాగోऽస్తీతి కేచిదాచార్యాః) శబ్దతన్మాత్ర సహభవత్వ సాత్వికాహంకారో పాదాన ద్రవ్యత్వాది ప్రాకృతేంద్రియ లక్షణం పునశ్చేంద్రియం ద్వివిధం జ్ఞానేంద్రియం కర్మేంద్రియమితి.

శుద్ధసత్వంబును, కాలంబును త్యజించి కొందరు చిదచిదీశ్వరులను తత్త్వత్రయంబునే చెప్పుచున్నారు. ధర్మభూత జ్ఞానము జ్ఞానాశ్రయంబ గుటచే చేతనమందును నిత్యవిభూతియు విగ్రహాది రూపంబున నీశ్వరునందును కాలము తత్త్వత్రయంబునకు విశేషణంబుగను ఉపసరజనంబులగుటచే దేహాత్మభ్రమ స్వతంత్రాత్మ భ్రమలకు నివర్తకములు గాజాలకుండుటం చేసియు తత్త్వత్రయమాత్ర విభాగంబున నట్టి భ్రమ నివృత్తి గలుగుట చేతను యీ విభాగమే న్యాయమైనదని వారల మతమై యున్నది. అద్రవ్యంబును సత్త్వము, రజస్సు, తమస్సు, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, సంయోగము, శక్తి యని

జ్ఞానప్రసరణ శక్తమింద్రియం జ్ఞానేంద్రియం తత్ షోఢా మనశ్శ్రోత్రాదిభేదాత్. అశుద్ధ సత్త్వేసతి పంచవిషయ సాధారణేంద్రియత్వం స్మృతికరణేంద్రి యత్వమిత్యాది ప్రాకృతమనో లక్షణం తచ్చహృత్ప్రదేశమాత్రాధిష్ఠానం ఇంద్రియాంతరాణామపి హృత్ప్రదేశ ఏవ కందస్థానం స్థానా న్తరేష్వపి యధాసంభవం వృత్తిశ్చ ఆత్మనోపి తత్ర భూయసావృత్తి. మన ఏవాంతః కరణం సంకల్పాధ్యవ సాయాదయ స్తద్వ్యాపారభేదా దేవ జాయన్త ఇతి నాంతఃకరణ వైవిధ్యం (శబ్దాదిపంచకం) శబ్దమాత్ర గ్రహణశక్తమింద్రియం ప్రాకృతశ్రోత్రం తస్మనుష్యాదీనాం కర్ణశష్కుల్యవచ్ఛిన్న వృత్తి. ద్విజిహ్వానాం నయనవృత్తి త్వగాదీనామపీంద్రియాణాం పూర్వోక్త శ్రోత్రలక్షణే శబ్దమాత్రపద స్థానే క్రమాత్స్పర్శ మాత్ర పదన్యాసేన లక్షణమూహ్యం తత్ర త్వగాశ్రయః కృత్స్నంవపుః ప్రదేశభేదేన స్పర్శోపలంభ తారతమ్యం నఖదంత కేశాదిషు స్పర్శానుపలంభశ్చ ప్రాణ మాంద్య తారతమ్యాదుపపద్యతే యథాయోగ్యం వాయ్వాది చతుష్టయం సంయోగేన తయా గృహ్యతే స్పర్శాదయస్తు సంయుక్తనిష్ఠతయా చక్షురాదీనా మాశ్రయా నయనగోళక తాలునాసాః. తత్ర గజానాం నాసాహస్తు ఇతి పాణిఘ్రాణయో రేక మేవాధిష్ఠానముచ్యతే. జంగమశరీరేష్వేవ ప్రాయనోఽయమింద్రియ ప్రదేశ నియమః. చక్షుషా వాయువ్యతిరిక్తభూతచతుష్టయం తథైవ గృహ్యతే. రూపాదయోఽపి స్పర్శాదివత్. జిహ్వాఘ్రాణా భ్యాం తు రసగంధౌ క్రమాత్సం యుక్తనిష్ఠతయా గృహ్యతే. తదేవం మనస్స్పర్శన లోచనాని ద్రవ్యాద్రవ్య గ్రాహకాణి శ్రోత్రజిహ్వాఘ్రాణాన్యద్రవ్యగ్రాహకాణి సర్వేషా మపీంద్రియాణాం తత్తత్కాలాది విశిష్ట వస్తుగ్రాహకత్వా ద్ద్రవ్యాద్రవ్య గ్రాహకత్వమేవవా. తతః కర్మేంద్రియం,

---

పది విధంబులుగ విభజింపబడుచున్నది. (ద్రవ్యవిభాగమందాదియగు) త్రిగుణమే ప్రకృతి యనబడును రజో గుణకము, తమోగుణకము మహదాద్యా శ్రయత్వము నునునివి త్రిగుణ లక్షణము. శుద్ధ సత్త్వమందతి వ్యాప్త మగుటచే సత్త్వగుణకంబని మాత్రము చెప్పజనదు. ఇయ్యది విచిత్రములగు సృష్టి కార్యంబుల కుపకరణ మగుటం జేసి మాయ యనియు, వికారంబులను గలుగజేయునది గావున (నవయవార్థంబుచే) ప్రకృతి యనియు విద్యా (బ్రహ్మవిద్య) విరోధియగుటచే యవిద్య యనియు నిట్లే యచిదచెతన ప్రధానాది శబ్దంబులచే వ్యవహరింప బడుచున్నది. ఇయ్యది సృష్టిసంహారాది కాల భేదంబునను గుణ వైషమ్య యుక్త తద్రహితంబులగు దేశ భేదంబునను నామ రూపవిభాగ నిర్దేశానర్హత్వరూప సమవికార సంతానంబులను తన్ని ర్దేశార్హత్వరూప విషమ వికార సంతానంబులను ఆరంభించుచున్నవి. అనగా సతత వికారశీలంబగు. ప్రకృతి గుణవైషమ్య యుక్తప్రదేశ విశేషంబున మహదాది విషమ వికారములను ప్రదేశాంతరంబున సమవికారంబులను గూడ గల్పించు చున్నదని భావము విషమ వికారరాహిత్యమునే ప్రళయ మనుటచే యపుడు సమ వికారంబులు గలిగినను ప్రళయత్వ వ్యాఘాతములేదు. ఇయ్యది పరిస్పందాది యోగ్యము లగు భూతేంద్రియ పరిణామదశ యందు సైతము

ఉచ్చారణాదిష్వన్య. తమక్రియా హేతుత్వం తల్లక్షణం. తత్పంచధా. వాగాదిభేదాత్. వర్ణోచ్చారణ కరణమింద్రియం వాక్, తచ్చ హృత్కంఠ జిహ్వామూలతాలు దంతోష్ఠనాసా మూర్ధరూప స్థానాష్టకవృత్తి (అష్టౌస్థానాని వర్ణానామురః కంఠశ్శిరస్తథా, జిహ్వామూలం చ దంతాశ్చనాసికోష్ఠౌ చ తాలు చ శిక్షా 13 శ్లో ) శుకాదీవ్యతిరిక్త విహంగాదీనాం తత్తదదృష్ట సంస్థానాది సహకారి విరహాద్వర్ణోచ్చారణాశక్తిః శుకాదీనామపి కించి త్తద్వైషమ్యాదుచ్చారణ వైషమ్యం ·శిల్పకరణమింద్రియం పాణిః. స చ మనుష్యాదీనా మంగుళ్యాది వృత్తిః. వారణాదీనాం నాసావృత్తిః. నను తాలుపాదాదిభి రప్యభ్యాస పాటవాన్మౌక్తిక గ్రథన లిపి కరణాది శిల్పదర్శనాత్తత్రాపి తద్వృత్తిరాస్థేయా సత్యం మాత్రయా వృత్తిరస్త్యేవ విరోధా భావాద్దేశభేదేన ఇంద్రియాంతర వ్యాప్తేర్దేశోऽవస్థానాదేశ్చక్షు స్స్పర్శనాదౌ దర్శనాదితి. సంచారకారణమింద్రియం పాదః స చ మనుష్యాదీనాం చరణాది వృత్తిః. భుజగ పతగా దీనాంతూరః పక్షాదివృత్తిః. 'పాదాత్కర్మేంద్రియా ' దిత్యవయవ విశేషలక్షణా సర్వే షామపి జంతూనామేకా దశేంద్రియ వత్త్వేన సాక్షాదింద్రియ నిషేధాయోగాత్. తస్య చ తత్త త్సంస్థానాది సహకారేణ స్థలజలగగనాది సంచారహేతుతా. విహగాది పరకాయ ప్రవేశోऽన్యయ

---

సిద్ధించుచున్నది. ఆకాశపర్యంతంబులగు వికారముల యందు ప్రకృతి వికృతుల రెంటియందును స్పర్శములేదు గావున భూతేంద్రియాది వికార ప్రదేశములందును సహావస్థానంబుగను నిశ్ఛిద్రం బుగను ప్రకృతి పదార్థము వ్యాపించి యుండుట కెట్టి ప్రతి ఘాతంబును లేదు. ఉద్దిష్ట పదార్థంబుల రెంటిలో నన్యతరంబు స్పర్శ శూన్యంబయినను సప్రతిఘత్వత దోషంబు గలిగిన దనుటకు స్పర్శవంతంబగు వాయ్వాది భూత చతుష్టయ స్పర్శవంతమగు నాకాశంబుచే వ్యాప్తమై యుండుటను దృష్టాంతముగ తీసుకొనదగును. ఈ విధమగు త్రిగుణమే పూర్వావస్థా ధ్వంసాత్మకమగు నుత్తరావస్థా భేదంబువలన నిరువది నాలుగు తత్త్వంబులగుచున్నది. మూల ప్రకృతి, మహత్తు, అహంకారము, ఏకాదశేంద్రి యములు (మనస్సు, వాక్కు, పాణి, పాదము, పాయు,ఉపస్థము, త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము) పంచ తన్మాత్రములు (ఆకాశ, వాయు, తేజో, జల, పృథివీ తన్మాత్రంబులు) పంచ భూతములు, (పృథివి, అప్పు, తేజము, వాయువు ఆకాశము) (1, 1, 1, 11, 5, 5, = 24) ఇట్లు ఒక్కటియగు త్రిగుణంబునకు నానాకారంబగు ప్రపంచ రూపంబున పరిణామంబును ఏకమగు మృత్పిండము ఘటశరావాది రూపముగ బరిణమించుట వంటిదిగాదు, అట్టి పరిణామము సావయవమగు మృత్పిండము నందువలె నిరవయవమగు ప్రకృతియందు సంభవింపజాలదు. అవయవాతిరిక్తమైన

వ్యతిరేకదర్శనాత్. మలాదిత్యాగకరణ మింద్రియం పాయుః. స చ తత్తదవయవ వృత్తిః విహంగ విశేషాణాంతు ముఖాదివృత్తిః యథా న్యాయతత్త్వే. 'యథా వామాంథాళా దీనా మాస్యేన విణ్మూత్రోత్సర్గ' ఇతి. ఆనందవిశేషకరణ మింద్రియముపస్థః. స చ మేహనాది వృత్తిః. సిద్ధమిద్ధ ' మింద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః ' ఇత్యాది ప్రమాణై రింద్రియాణామేకాదశ సంఖ్యావత్వం వ్యదచ్ఛిద్యతే చాధిక సంఖ్యా ఏవమేషామే వైతావత్వామేవైవం స్వభావానా మేవాగమేనైన సిద్ధత్వాత్సౌగత వైశేషిక చార్వాక ప్రభృతీనాంస్త్రీంద్రియ పురుషేంద్రియాది కల్పనం కర్మేంద్రియ పరిత్యాగః, ఏకేంద్రియ వాదః. తత్రాపిత్వగింద్రియైకస్వీకారః శరీరస్యైవేంద్రియత్వం కర్మేంద్రియాణాం శరీరోత్పత్తి వినాశయోరుత్పత్తి వినాశౌ, మనోవిభుత్వ నిత్యత్వ తైజసత్త్వ నిర్మనస్కత్వాదీని రాజసాహంకారజన్యత్వ భౌతికత్వాదీన్యన్యాన్యపి ప్రలపి తాస్య నాదరణీయాని యుక్తి బాధాదయశ్చ యథా సంభవ మున్నేయా ఇతి. అథ తన్మాత్రాది సృష్టిః. భూతానామవ్యవహిత సూక్ష్మావస్థావిశిష్టం ద్రవ్యం తన్మాత్రం, దధిరూపేణ పరిణమ మానస్య పయసోమధ్య మావస్థావ ద్భూతరూపేణ పరిణమమానస్య ద్రవ్యస్య తతః పూర్వా కాచిదవస్థా తన్మాత్రా తద్విశిష్టమపి ద్రవ్యం తన్మాత్రం తదేవభూతో పాదానమితి న శబ్దాదిగుణ మాత్రాద్భూతసృష్టిః. విశిష్ట శబ్దాది విషయాధికరణం భూతం. అత్రాపి ప్రాకృతా ప్రాకృతవివేకః పూర్వవత్. తన్మాత్రాణి చ భూతాని చ ప్రత్యేకం పంచథా.

---

యవయవియగు త్రిగుణ ద్రవ్యము అంగీకరింప బడదు గావున నానావయంవంబులు (పరిణామవాదమందు) నానాకారంబులుగ బరిణ మించుటయు తటస్థముగా వచ్చును. కావునా నేకోపాదానవాదము సమంజసమైనది కాదు. మరియు నిది సమత్రైగుణ్యామై యొప్పుచున్నది. అందును స్వల్పమగు భేదము నవలంబించి యవ్యక్తము, అక్షరము విభక్త తమము, అవిభక్తతమము అనుపేర ప్రకృతి నాలుగు విధంబులుగ వ్యవహరింపబడుచున్నది. మూల ప్రకృతియనునది బీజస్థానీయము మహత్త్వ మంకురస్థానీయము, అందవిభక్తతమంబనునది భూతలనిహిత బీజతుల్యము, విభక్తతమంబు మృత్తునుండి బయలువెడలిన బీజతుల్యము, అక్షరము సలిలసంస్పృష్టమగుటచే నార్ద్రమై శిథిలావయవంబులు గలిగిన బీజతుల్యము. అవ్యక్తముచ్ఛూన (యెండిన) బీజతుల్యము, ఇట్లనుటవలన గుణత్రయ వైషమ్యమున కనంతర పూర్వావస్థయగు గుణసామ్యమే యవ్యక్తము (ఆయవస్థయందు గుణసామ్యంబును అస్ఫుటంబయి యొప్పును) అనియు, ఈయవ్యక్తమే చేతన గర్భసమష్టిరూపమై యక్షర శబ్ద వాచ్యంబగు, ననియు అక్షరాద్యవస్థా ప్రాప్త్యౌన్ముఖ్య విశిష్టంబగు తమంబ విభక్తతమంబనియు తదౌన్ముఖ్యరహితంబగు తమంబ విభక్తతమంబనియు తెలియుచున్నది.

శబ్ద తన్మాత్రాకాశాదిభేదాత్. తత్ర తామసాహంకారాకాశయో ర్మధ్యమావస్థావిశిష్టం ద్రవ్యం శబ్ద తన్మాత్రం ఏవముత్తరోత్తరతన్మాత్రేష్వపి తత్తద్భూతద్వయ మధ్యమావస్థా విశిష్టత్వం అవిశిష్టతత్త ద్గుణాశ్రయత్వం తత్తద్భూతోపాదానత్వం చ లక్షణమూహ్యం. అస్పర్శత్వేసతి విశిష్ట శబ్దాధారత్వ శ్రోత్రాప్యాయకత్వం చాకాశలక్షణం. అయం చావకాశదానాదినోపకరోతీతి శాస్త్రసిద్ధత్వా దభ్యుపేత్యం ప్రత్యక్షశ్చాయమాకాశః యదోన్మీలనం చక్షుషస్తదైవాకాశోఽయమితి ప్రతీతేః. ఆగమవశాదేవాకాశే శబ్దమభ్యుపయంతి వృద్ధాః. ఆకాశాత్స్పర్శ తన్మాత్రం తతో వాయుః విశిష్టస్పర్శవత్త్వే సతి రూపశూన్యత్వం అస్మదాది స్పర్శనై కేంద్రియ గ్రాహ్యద్రవ్యత్వమనుష్ణాశీత స్పర్శవిశిష్టత్వేసతి గంధశూన్యత్వ మిత్యాది తల్లక్షణం. తస్య చ వాయోస్స్వభావాద్వా అదృష్టాత్మకేశ్వర సంకల్పాద్వా స్వోరసికం త్రిర్యక్ప్రసారణం, పార్థివాది ద్రవ్యేణ వాయ్వంత రేణవాఽభి ఘాతవశాద్భ్రు మణోర్ధ్వ గమనాదయః తే చ దూరస్థేన తృణరజ్జు ప్రభృతినాం భ్రమణోర్ధ్వగమనాదిభి రనుమేయాః. తత్రత్యేన స్పర్శన గ్రాహ్యః. ఏతేన వాయోర్నానాత్వమపి సిద్ధ్యతి. అస్య చ సర్వతః పార్థివాప్యోపరోధే సతిస్తంభః. భస్త్రికాంతర్గత వాయ్వాదౌ హి తథాదృశ్యతే. తస్యచ సలిలాతపకుసుమాదియోగాచ్ఛీతోష్ణ సౌరభారోపః. తథా చాన్వయవ్యతిరేకౌ సలిలాది సంసర్గేసతి వాయౌ శీతస్పర్శాది ప్రత్యయః, తదభావేనేత్యనుభవాత్. (దురూహం వస్తుశక్తిమ వలంబ్యైవ స్వభావః ప్రభావశ్చ భవద్భి రాయుర్వేదాచార్యైరేవ క్వచిత్క్వచి ద్దుందుభి స్వనాదావుపవర్ణ్యన్ మానత్వా ' ద్వృద్ధిస్సమానై స్సర్వేషాం విపరీతైర్విపర్యయ ' ఇతి న్యాయా ద్వాయుశ్శీత ఇతి వాదోపి నిరస్యతే) స చ త్వగింద్రయాప్యాయనేన ప్రాణ శరీర విషయాత్మనా చోపకరోతి. తత్ర శరీర ధారణాది హేతుర్వాయువిశేష ఏవప్రాణ సంజ్ఞః.

---

(తమంబనిన చిదర్భంబును తెలియరాని సూక్ష్మ ద్రవ్యమునకు పేరని వ్యవహారము.) ఇయ్యది సలిల విలీన లవణంబును చంద్ర కాంతమందలి శలిలంబును సూర్యకాంతమందలి వహ్నియునుంబోలె

సర్వజ్ఞుడగు పరమాత్మ చేతనే తెలియదగియున్నది. కావున 'అవ్యక్తమక్షరేలీ యతే అక్షరం తమసీ లీయతే, తమసః పరేదేవ ఏకీభవతి' అను మొదలగు శ్రుతులచే సలిల విలీన లవణ న్యాయంబుగ నవి భక్తతమంబు ప్రకృతి కాదిమరూపము, అందుండి విభక్తతమము, దానినుండి యక్షరము, అక్షరము నుండి యవ్యక్తము ఆయవ్యక్తమునుండి మహత్త్వంబును గలుగు చున్నదను తాత్పర్యము. అహంకారత్వావస్థకు అవ్యవహిత పూర్వావస్థా విశిష్టమగు ద్రవ్యము త్రిగుణద్రవ్యము మహత్తు (మహాన్) అనబడుచున్నది. ఈమహత్తు సాత్త్విక రాజస తామస భేదంబులచే మూడు విధంబులగు చున్నది. ఒకొక్క యహంకారమందును గుణత్రయమే నిబిడమై యున్నను ఆయాగుణ గతంబగునుద్భవ శక్తి విశేషంబు వలనను ఆయాగుణముల

స ఏవ వ్యాపార భేదాత్పంచధా దశధా చోచ్యతే. తధా 'న వాయుక్రియే పృధగుపదేశాత్' 'పంచవృత్తిర్మనోవద్వ్య పదిశ్యతే' ఇతి సూత్రకార ఆహ (అయమర్థః 'యః ప్రాణస్సవాయుః స ఏష వాయుః పంచ విధః' ఇతి శ్రుతి బలాద్వాయుః ప్రాణ ఇతి న సంభవతి. ఉచ్ఛ్వాస నిశ్వాసాదిషు ప్రాణప్రసిద్ధేః వాయు క్రియాప్రాణ ఇత్యపి న సంభవతి పృథగుప దేశాత్. 'ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణి చ ఖం వాయురితి వాయ్వపేక్షయా ప్రాణస్య పృధగుపదేశాత్. ఇత్యాద్యస్య 'కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతి హ్రీన్ర్భీర్ధిరిత్యేతత్సర్వం మన ఏవేతి యధా కామాది వృత్తి భేదేపి న కామాదికం మనసస్తత్వాంతరం తథా' 'ప్రాణోవ్యానోఽపాన ఉదానస్సమాన' ఇత్యేతత్సర్వం ప్రాణఏవేతి వచనాదపానాదయోపిప్రాణస్యైవ వృత్తివిశేషా ఇత్యన్యస్య చ ద్రష్టవ్యం.) స చ ప్రాణాపానవ్యానోదాన సమాన బేదాత్పంచధా. నాగకూర్మకృకరదేవదత్త ధనంజయా ఖ్యైర్భేదైః పునర్దశధా. ప్రాణశబ్దంతు (కధామాత్రసాధారణ) వాదశబ్దవత్ సామాన్యతో విశేషతశ్చ నిష్పన్నో జ్ఞేయః. అస్య శరీరేంద్రియధారకత్వం శ్రుతి సిద్ధం. తధా ఛందోగవాజసనేయక శ్రుతిః యస్మిన్నుత్క్రాంత ఇదగ్ం శరీరం పాపిష్ఠమివ దృశ్యత. ఇత్యాది ఏవం జంగమ శరీరేష్వివ స్థావరశరీరేష్వపి సోఽస్త్యేన మూలనిషి కసలిలదోహళ పార్థిపధా తూనామభ్యా దానాత్. నఖదంత రోమకిణాదీనామపి మంద ప్రాణాశ్రయత్వమస్తి. అస్యైవ రెచకపూరక కుంభకరూపం నియమన మష్టాంగ యోగే చతుర్థమంగం, ప్రాణాభ్యాద్వాయోరన్య ఏవ శరీరో పాదాన భూతో వాయుః. తదుపాదానత్వం వాయు ప్రచురేషు మారుతాదిశరీరేషు వ్యక్తం. విషయత్వం చండవాత తాళవృంత పవనాదిషు. తస్మాద్వాయో రూపతన్మాత్రం. తతస్తేజః ఉష్ణ స్పర్శవత్వ భాస్వరరూపవత్వాదికం చ తేజోలక్షణం. తచ్చ వాక్చక్షుషో రాప్యాయకం దివాభీతా దివ్యతిరిక్తలోచనానాం అంజనవిశేషాది శూన్యానాం తిమిరాద్యతిరిక్త విషయ ప్రత్యయోత్పాదనే ప్రభూతరూపమాప్యాయ కాతిరిక్తం తదవశ్యాపేక్షితం. వైశ్వానరా ధ్యాత్మనా చ తదుపకారః. వైశ్వానరో నామ శరీరాంతర్వర్తీ ప్రాణాది సంయోగారశిత పీతపాకాదిహేతు స్తేజోవిశేషః. శరీరత్వాది తేజసస్తేజః ప్రచురేషు దహనతపనాది శరీరేషు వ్యక్తం విషయత్వం చంద్రికా శతహ్రదా హుతవహాదిషు తత్రహుతవహస్య జ్వాలాత్మకస్య

---

యొక్క ప్రచురాంశ భేదంబు వలనను సాత్త్వికాది వ్యపదేశ ముపపన్న మగుచున్నది. ఇంద్రియత్వావస్థక వ్యవహిత పూర్వావస్థావిశిష్ట త్రిగుణ ద్రవ్యము అహంకారమనబడును. ఇదియు మహత్తువలెనే సాత్వికాది భేదంబులచే త్రివిధంబగును. అందు సాత్త్వికాహంకారంబు నుండి యింద్రియములును, తామసాహంకారంబునుండి తన్మాత్రలును గలుగు చున్నవి. రాజసాహం కారము భయంబున కను గ్రాహకంబగును. ప్రాణాదు లలో నన్యతమమై హృత్కంఠచక్షురాది ప్రదేశ విశేషావచ్ఛిన్న వ్యాపారముచే తత్తత్కార్య విశేషమునందు సమర్థమైన ద్రవ్యమును యింద్రియమనియు

దాహ్యనాశే నాశదర్శనాత్ పుష్కల కారణక్రమోప నిపాతాదేకదా నేకదీపాదర్శనాదా శుతరవినాశిత్వరూప ం క్షణికత్వం సిద్ధం. తత్ర చ భౌమదివ్యాదిభేదః భౌమాని ప్రదీపాదీని, దివ్యాన్యాదిత్యాదీని జ్యోతీంషి తథౌదర్యాదీనిచ, తత్ర తత్ర సామగ్రీ కార్యాణి క్షణికత్వ స్థిరత్వాదీని యథాయోగ మున్నేయాని. తేజః పునస్సామాన్యతో ద్వివిధం. ప్రభా ప్రభావాంశ్చేతి. ఆవరణ సద సద్భావాధీన సంకోచవికాసో యథావేగశక్త్యధిష్ఠానదేశాధిక దేశ ప్రసారీ తేజోవిశేషః ప్రభా. సా చ ప్రభావద్భిస్సహో త్పద్యతే సహ చవినశ్యతి. న చైషా స్వతంత్రా దీపాద్యపృథక్సిద్ధతయైవ ప్రతీతే. తద్విశిష్టం తేజః ప్రభావత్. తచ్చ మణిద్యుమణి దీపాద బహుప్రకారం సామగ్రీ విశేషాదీన స్వభావభేదాత్తేజస శ్చైకహర్షశోషణ వృద్ధిపాక ప్రకాశాది జనకత్వ తారతమ్యం. తస్య రోహితీ భాస్వరైక స్వభావ స్యాపి సలిలాది సంసర్గభేదాద్వర్ణ వైచిత్ర్యోపలంభః. తస్మత్తేజసోరస తన్మాత్రం తస్మాదాపః శీతస్పర్శవత్త్వం నిర్గంధత్వే సతి విశిష్టరస వత్త్వమిత్యాది తల్లక్షణం. తాసాంశుక్లమధుర శీతతైక స్వభావానామా శ్రయాది సంసర్గ భేదా ద్రూపరసస్పర్శ వైచిత్ర్యారోపః. స్వాభావిక మాసాంద్రవత్త్వం ఆప్యేష్వపి కరకాదిషూపష్టంభవశాత్కాఠిన్యం. ప్రాణరసనాప్యాయ నాదినోపకుర్యతే శరీరత్వమానామ ప్రచురేషు వరుణలోక శరీరేషు స్పష్టం విషయత్వం సరిత్సముద్రాదిషు.

తాభ్యోऽద్భ్యో గంధతన్మాత్రం. తతః పృథివీ విశిష్ట గంధవత్త్వ రసవత్త్వే సతి విశిష్ట స్పర్శవత్త్వమిత్యాది తల్లక్షణం సా ప్రథమ సురభి మధుర కృష్ణానుష్ణా శీతస్పర్శా జాతాత తోऽనుష్ణా శీతత్వం సర్వదానువృత్తం తేజస్సలిల స్పర్శోపాధ్యన్వయ వ్యతిరేకాత్తదుపాధిక ఏవౌష్ణ్య శైత్యోపలంభః. కార్ష్ణ్య రచాస్యాస్స్వ తస్సిద్ధం, యత్కృష్ణం తదన్న స్యేత్యాది శ్రుతేః,

యనదగును. ప్రాకృతేంద్రియమనియు నప్రాకృతేంద్రియమనియు నింద్రియమ్ము ద్వివిధము శుద్ధ సత్త్వాశుద్ధ సత్త్వ యోగంబుచే నీ విభాగము చేయ బడినది. (అవ్యక్త మహదహంకారా దులందును యిట్టి విభాగము కలదని యొక మతము గలదు) శబ్దతన్మాత సహభవత్వము, సాత్త్వికాహం కారోపా దాన ద్రవ్యత్వముననునిది ప్రాకృతేంద్రియ లక్షణము, మరియు ప్రకారాంత రముచే నీయింద్రియమును జ్ఞానేంద్రియము, కర్మేంద్రియము నని రెండు తెరంగులుగ విభజించుచున్నారు. జ్ఞాన ప్రసరణ శక్త మగునది జ్ఞానేంద్రియము, ఇదిమనస్సు, శ్రోత్రము, త్వచము, చక్షుస్సు, రసనము, ఘ్రాణము అని యారు విధంబులయి యున్నది. (మనసునకు జ్ఞాన ద్వారంబుననే సర్వహేతుత్వము సిద్ధించు గావున సర్వప్రవృత్తులును మనః పూర్వకంబులు గావున మనసును కర్మేంద్రియంబను సాంఖ్యుల వాదము సరియైనది కాదు. అశుద్ధ సత్త్వమయి పంచవిషయ సాధారణేంద్రియత్వము స్మృతి కరణేంద్రియత్వముననను నిది ప్రాకృత మనోలక్షణము, ఇయ్యది హృత్ప్రదేశ మాత్రాదిస్థానమై యున్నది. ఇంద్రియాంతరంబులకును నీ

పాకభేదాత్తు విచిత్రవర్ణాజాయతె. తస్యాః కాఠిన్యేపి సలిలతాపాదియోగాత్క్వ చిర్ద్రవత్వోప లంభః మనో ఘ్రాణాప్యాయనాదినా చ తస్యా ఉపకారః. శరీరత్వమస్యామనుష్య తిర్యక్స్థావ రాదిషు వ్యక్తం విషయత్వం మృత్పాషాణౌషధిత మిరాదిషు. తమోద్రవ్యం పార్థివం చ ఆబాధితనీలాదిప్రత్యయ విషయత్వాత్. స్పర్శానుపలంభాది చోద్యం తు ఇంద్రనీలాలో

హృదయ ప్రదేశమే కందస్థానమై యొప్పుచున్నను ఆయాస్థానాంతరముల యందును యధాసంభవముగ నవస్థానము గలిగియున్నది. ఆత్మకు గూడ నా ప్రదేశమందే విశేషవృత్తి గలిగియున్నది. ఇట్టిమనంబే యంతఃకరణం బనంబడును. సంకల్పము, అధ్యవసాయము మొదలగువన్నియు నామనసు నందే వ్యాపారభేదంబుచే గల్గుచున్నందువలన నాయంతఃకరణము విభిన్న మైనదనుట సరియైనదికాదు. శబ్దమాత్ర గ్రహణశక్తమగు నింద్రియము ప్రాకృత శ్రోత్రంబనంబడు నియ్యది మనుష్యాదులకు కర్ణకుహరావచ్ఛిన్న వృత్తియు ద్విరసనంబులకు నయన వృత్తియునై యున్నది త్వగాదీంద్రియ చతుష్కంబునకును పూర్వోక్త శ్రోత్ర లక్షణమందు 'శబ్దమాత్ర'యను పదమునకు క్రమంబుగ 'స్పర్శమాత్ర' యను పదంబుననువుపరచి లక్షణము యెరుంగదగినది. అందును శరీరమంతయు త్వగింద్రియా శ్రయంబగుచున్నది. ప్రదేశ భేదంబుచే నయన గోళకాదుల యందును పాద తలమందును స్పర్శోపలంభ తారతమ్యంబును నఖదంత కేశాదుల యందు స్పర్శానుపలంభంబును ప్రాణవాయ్వల్పత్వ భూయస్త్వ కృతంబగు తారతమ్యంబువలన సిద్ధించుచున్నది. యధా యోగ్యంబుగ వాయ్వాది చతుష్టయంబు సంయోగ సంబంధము చేతను స్పర్శాదులు సంయుక్త నిష్ఠంబుగను నాత్వగింద్రియమువలన గ్రహింపబడుచున్నది. చక్షురాదీంద్రీయ త్రితయంబునకు గ్రమంబుగ నయన గోళకంబును తాలువు లును నాసికంబును స్థానంబులు. వారణంబులకు నాసికంబుకరం (తొండము) బగుటచే పాణి ఘ్రాణంబుల రెంటికిని కరంబే యధిష్ఠానమై యున్నది. ప్రాయికంబుగ నీవిధంబుగ నింద్రియప్రదేశ నియమము జంగమ శరీరముల యందే గానవచ్చుచున్నది. వాయు వ్యతిరిక్తమగు భూతచతుష్టయంబును ఇట్టే సంయోగ సంబంధముచే తెలియబడుచున్నవి. రూపాదులును స్పర్శాదులంబోలె సంయుక్త నిష్ఠంబులుగ గ్రహింప బడుచున్నవి. ఇట్టే జిహ్వా ఘ్రాణంబులచే రస గంధంబులును సంయుక్త నిష్టంబులుగనే గ్రహింపబడుచున్నవి. ఈతీరుగ మనస్స్పర్శన లోచనంబులు ద్రవ్యాద్రవ్యో భయ గ్రాహకంబులును, శ్రోత్రజిహ్వా ఘ్రాణంబులు ద్రవ్యమాత్ర గ్రాహకంబు లును, అగుచున్నవి. సర్వేంద్రియంబులకును తత్తత్కాలాది విశిష్టవస్తు గ్రాహకం బనునది సర్వవిధ ప్రత్యక్ష విషయంబగుటం చేసి

కాదిష్వివ నిర్వాహ్యం ఆగమసిద్దం చ తమసో ద్రవ్యత్వాదికం తమస్ససర్జ భగవానితి తత్త్వాంతరవత్సృష్టి శ్రవణాత్. 'నాసీత్తమోజ్యోతిరభూన్నచాన్య ' దితి కార్యాంతరైర్జ్యోతిషా చ సహ లయాభిధా నాత్. ఉక్తం చ తత్త్వ సారకృద్భిః. ' తమో నామ ద్రవ్యం బహళవిరలం మేచకచలం ప్రతీమః కేనాపి క్వచిదపి న బాధశ్చ దదృశే, అతః కల్ప్యే హేతుః ప్రమితిరపి శాబ్దీ విజయతే నిరాలోకం చక్షుః ప్రథయతి హితద్దర్శన వశా ' దితి.

**తదేవం చతుర్వింశతి తత్త్వాని** చింతితాని. 'ఆత్మన ఆకాశస్సంభూతిః' తత్తేజోऽసృజాతేత్యాది న్యూనసృష్టివ్యపదేశాః న తత్త్వాంతర సృష్టిప్రతిక్షేపపరాః ప్రామాణికత్వా విశేషేణ తత్పరిత్యాగోయోగత్. (అనాదిర్భగవాన్ కాలోనాంతోऽస్యద్విజ విద్యత ఇత్యాదినాకాలస్య మాయా సృజ్యత్వాదికం బాధితం.)

ఏతానితత్త్వాని ప్రథమమీశ్వర స్స్వసంకల్పా దేవతత్తద్వ్యహిత పూర్వపూర్వతత్త్వ శరీరక స్సృష్ట్వా వ్యష్టి నామరూపవ్యాకరణం సంకల్ప్య తేషాంతత్త్వానాం పృథగ్భూతానాం వ్యష్టి సృష్ట్యశక్తేః పరస్పరసంమిశ్రణం చ సంకల్ప్య వ్యోమ్నోర్ధ్వభాగశ్చత్వారో వాయుతేజఃపయోభువా మిత్యాది క్రమేణైకైక

ద్రవ్యాద్రవ్యోభయ గ్రాహకత్వంబు సెప్పినను చెప్పవచ్చును. ఈ విధంబుగ జ్ఞానేంద్రియ స్వరూపము వివరింపబడినది.

కర్మేంద్రియంబనిన:- ఉచ్చారణాది రూపమగు నన్యతమక్రియా హేతుత్వము కర్మేంద్రియ లక్షణము. ఇయ్యది వాక్పాణి పాయూపస్థలను పేరిట నైదువిధంబులయి యున్నది. వర్ణోచ్చారణ కరణంబగు నింద్రియము వాగింద్రియము. ఇయ్యది హృదయము, కంఠము, జిహ్వామూలము, తాలువులు, దంతములు, ఓష్ఠములు, నాసిక మూర్ధము ననునెనిమిది స్థానముల యందుండును. శుకాది వ్యతిరిక్తములగు విహంగములకు తత్తద దృష్ట సంస్థా నాదికమగు సహకారి విరహంబువలన వర్ణోచ్చారణమందు శక్తి జనియింప జాలకున్నది. శుకాదులకును ఆ యదృష్టమందు స్వల్పమగు వైషమ్యము వలన నుచ్చారణ వైషమ్యము సహజమైయున్నది. శిల్పకరణమగు నింద్రియము పాణీంద్రయము. ఇయ్యది మనుష్యాదులకు అంగుళ్యాది వృత్తియు వారణాదులకు నాసికా వృత్తి యునగుచున్నది. తాలు పాదాదులచే యభ్యాస పాటవంబు వలన మౌక్తిక గ్రథన లిపికరణాది శిల్పంబులు చేయజాలుటచే ఆయాస్థలముల యందును పాణీంద్రియము యొక్క ప్రసరణము నంగీకరించు టచే తదింద్రియ వృత్తియ ముఖ్యముగ నంగీకరింప బడుచున్నది. అధిష్టాన భేదము ప్రతినియతమై యుండుటం జేసి పాదేంద్రియాద్యధిష్ఠాన మందు పాణీంద్రియ ప్రసరణము ప్రదేశ భేదముచే యంగీకరింప బడుటకు సంశయముండ జాలదు. నయనగోళక

భూతేషు భూతాంతరాణామష్టమాంశ చతుష్కైః పంచీకరణం కృత్వాతేషు స్వానుప్రవిష్ట జీవవర్గమనుప్రవేశ్యతైరేవ తత్త్వైర్దశగుణితోత్తర సప్తావరణ వేష్టితం హేమాఖ్యపరిణామ గత భూతమయం బ్రహ్మాండ మారభ్య తదంతరే చ స్వనాభి పంకజ ప్రభృతి సప్తస్థానేష్వ న్యతమేన సకలతదండాంతర్వర్తి చేతనభరిత విగ్రహం చతుర్ముఖం ప్రసాదాత్సృజతి. క్రోధాచ్చ రుద్రం (అత్రశ్రుతిః ఏకోహివై నారాయణ ఆసీత్. స బ్రహ్మనేశాన ఇత్యారభ్య తత్ర బ్రహ్మ చతుర్ముఖోऽజాయత త్ర్యక్షశ్శూలపాణిః పురుషోऽజాయత ఇత్యాది కా నారాయణాద్బ్రహ్మ జాయతే. 'నారాయణాద్రుద్రో జాయతే' ఇత్యాదయశ్చ తథా 'అహం ప్రసాదజస్తుభ్యం లోకధామ్నే స్వయంభువేత్వత్తో మే మానసం జన్మ ప్రథమం ద్విజపూజితం' చాక్షుషం వైద్వితీయం మ ఆసీజ్జన్మ పురాతనం త్వత్ప్రసాదాచ్చ మే జన్మ తృతీయం వాచికం మహత్. త్వత్తో మే శ్రావణం చాపి చతుర్థం జన్మ మే విభోనాసిక్యం చైవ మే జన్మ త్వత్తః పంచమముచ్యతే. అండజం చాపి మే జన్మత్వత్తఃషష్ఠం వినిర్మితం, ఇదం చ సప్తమం జన్మ పద్మజం మేऽమితి ప్రభేత్యాది హయశిరోపాఖ్యానం చ స చ భగవాననన్తరం స్వవిహిత బ్రహ్మంతర్యామి రూపేణా వస్థితస్స్వ ప్రహిత వేదోపజ్ఞ విజ్ఞానేనస్వార్పితాభ్యాం విచిత్రసృష్టివిషయబుద్ధి శక్తిభ్యాముపబృంహితేవ స్వవిర్ధూత మధుకైటభాది వివిధాపదా బ్రహ్మణా బ్రహ్మండాంతశ్చతుర్దశ భువన సంస్థాన తదధికరణక దేవతిర్యఙ్మనుష్యస్థావరాది దిగ్విశేషాది వివిధ విచిత్ర వ్యష్టి సంజ్ఞామూర్తి సృష్టిం కారయతి కరోతి చ తచ్ఛరీరకః సంహారయతి సంహరతి చ హరిశరీరకః తదేతద్బ్రహ్మండ ప్రభృతి స్తంబపర్యంతం సర్వమపి పంచ భూతాత్మకం. పంచీ కరణాది వచనాత్. తాసాంత్రివృతం త్రివృత మేకైకాం కరవాణీ త్యుపలక్షణం. ఏవం పంచీకరణ మప్యుపలక్షణ మేవ తథా భగవాన్పరాశరః నానావీర్యాః పృథగ్భూతాస్తతస్తే సంహతింవినా, నాశక్నువన్ ప్రజాస్స్రష్టు మసమాగమ్య కృత్స్నశః సమేత్యాన్యోన్య సంయోగం పరస్పర సమాశ్రయాః ఏక సంఘాతలక్షాస్తు సంప్రాప్యైక్య మశేషతః. మహదాదయో విశేషాన్తాహ్యండముత్పాదయన్తిత ఇతి. ఏవమష్ట ద్రవ్యోపాదానాని శరీరాణి. ఇంద్రియాణితు శరీరాశ్రితాని ద్రవ్యాంతరాణి ఏతచ్ఛరీరం చద్వివిధం, నిత్యం మనిత్యం చేతి తత్ర నిత్యం త్రిగుణ ద్రవ్యకాల జీవశుభాశ్రయాత్మక మీశ్వరశరీరం నిత్యానాం చ స్వాభావికగరుడ భుజగాదిరూపం అనిత్యం చ ద్వివిధం అకర్మకృతం కర్మకృతం చేతి. ప్రధమ మీశ్వరస్య మహదాదిరూపం

రసనాదుల యందు త్వగింద్రియ సద్భావము కనుబడు చుండుటచే వాస్తవ దృష్టిచే నింద్రియాంతరముచే వ్యాప్తమగు దేశంబున నింద్రియాంతరస సద్భావంబును అవిరుద్ధమే యగుచున్నది. సంచారణ కారణంబగు నింద్రియము పాదేంద్రియము. ఇయ్యది మనుష్యాదులకు చరణాది వృత్తియు భుజగపతగాదులకు ఉరః పక్షాదివృత్తియు అగుచున్నది. అట్టి పాదేంద్రియమున కాయాసంస్థానాది సహకారంబువలన స్థలజల గగనాది సంచార హేతుత్వము సిద్ధించుచున్నది. మనుష్య శరీరమందలి పాదేంద్రియంబున కాకాశసంచరణ మందు సామర్థ్యము లేకుండుటయు

తథానన్తగరుడాదీనాం ముక్తానాం చేచ్ఛాకృతి తత్తద్రూపం కర్మకృతమపి ద్వివిధం స్వసంకల్ప సహకృతకర్మకృతం కేవలకర్మకృతం చేతి, పూర్వం మహతాం సౌభరిప్రభృతీనాం ఉత్తరం చాన్యేషాం క్షుద్రాణాం.

పునశ్శరీరం సామాన్యతో ద్విధా జంగమమజంగమం చేతి. కాష్ఠాదీనాం శిలాదీనాం చాజంగమత్వమేవ. యథావృక్షగుల్మలతా వీరుత్తృణానాం తమోమోహమహామోహ తమిస్రాంధతామిస్రసంజ్ఞానాం, శిలాదిశరీరిణోపి జీవావిద్యన్త ఇత్యహల్యాది వృత్తాంత శ్రవణాత్సిద్ధం. జంగమం చతుర్ధా, దేవతిర్యఙ్మనుష్య తిర్యఙ్నారకి సంస్థానభేదాత్. అసురయక్ష రాక్షసాదయోऽపి దేవయోనయః భూలోకవర్తి బ్రహ్మక్ష త్రియవీట్ఛూద్రాదయో మనుష్యయోనయః. తేషాం తు శ్రుతిస్మృత్యుక్త విధినిషేధవిషయతా. దేవాదీనామపి సాऽస్త్యేవ ప్రాయశ్చిత్తా ధ్వంతపశ్చర్యాబ్రహ్మ విద్యాదిశ్రవణాత్. మృగపక్షీ సరీసృపా దయస్తిర్యగ్యోనయః నారకిరణస్తు రౌరవాదిషు దుఃఖైకాశ్రయదుస్త్యజవిగ్రహాః. జంగమం పునర్ద్వివిధం యోనిజమయోనిజం చేతి.

ఇదందేవాదిషు త్రిష్వపి సంభవతి ప్రజాపతిమధుకైటభ ధృష్టద్యుమ్నైరావతస్వేద జాదదర్శనాత్. తత్ర యోనిజేష్వేవ పంచమాహుత్యపేక్షా యోని ప్రాప్తేః పూర్వమాకాశవాయు ధూమాభ్రమేఘ వృష్టి వ్రీహ్యాది రేతస్సిక్త్యన్య శరీరేషు సంసర్గమాత్రం తత్ర వ్రీహ్యాది ప్రాప్తేః పూర్వం శీఘ్రమేవ నిష్క్రమణం తతఃపరం దుర్నిష్ప్రతరం ద్యుపర్జన్యపృథివీ పురుషానన్తరం పంచమ యోషీదగ్నౌ హుతస్య తత్తత్కాలనియత పరిణామాదయ ఆయుర్వేదయోగాది శాస్త్రేషు విశదమవ సేయాః. **తథావిమానార్చనకల్పేద్వ్యశీతితమే పటలే** భగవాన్మరీచిః. అథదేహోత్పత్తి ప్రకారః. ఓషధీభ్యోన్నముపజాయతే. తదన్నం త్రివిధం భవత్యేకం మూత్రం పురీషమేకమేకం పురుషాణాం శుక్రం స్త్రీణాం శోణితం శుక్లశోణితయోః క్షీరేసర్పిరివ

విహంగాది పరకాయ ప్రవేశంబు జేసినపుడాయాత్మకే తన పాదేంద్రియమున కట్టి యాకాశసంచరణ సామర్థ్యము గలుగుటయను నన్వయ వ్యతిరేక దృష్టాంతములచే నీ యర్థము స్థిరపరుపబడుచున్నది. మలాదిత్యాగకరణమగు నింద్రియము పాయువు. ఇయ్యది ఆయాయవయవ వృత్తియగును.

వామాంధాళము ? ( ) మొదలగు పక్షులకిది ముఖ ప్రదేశ వృత్తియై యున్నది. ఆనంద విశేషకరణమగు నింద్రియ ముపస్థయనం బడును. ఇయ్యది మేహనాదివృత్తియైయున్నది. ఇట్లు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ములను స్థిరపరచుటచే స్త్రీంద్రియ పురుషేంద్రియ కల్పనంబును ఇవియే యను నవధారణంబుచే కర్మేంద్రియ పరిత్యాగంబును యీ స్వభావంబు గలవనుటచే శరీర సమకాలోత్పత్తి వినాశిత్వాదులును నిరసింపబడుచున్నవి. ఇట్లే ఆగమంబుచే ఏకేంద్రియ వాదము, త్వగింద్రియ స్వీకారము, శరీరేంద్రియ వాదము. మనోవిభుత్వ నిత్యత్వ తైజసత్వ నిర్మనస్కత్వాది

సర్వవ్యాపినీ మాయాశక్తిర్భవతి. పురుషబీజమూలసంచితం శుక్లం. స్త్రీకుచమూల సంచితం శోణితం సంయోగకాలే దైవయోగేన వాయునా గర్భాలయం ప్రవిశతి. తత్రైకరాత్రోషితం కలిలం ద్విరాత్రోషితం బుద్బుదం త్రిరాత్రోషితం మాంసలం, చతురాత్రోషితం పేశలం, పంచరాత్రోషితం ఘనం షడ్రాత్రోషితం వ్యూహం సప్తరాత్రోషితం బంధ మష్టరాత్రోషితం సుకుమారం నవరాత్రోషితం యౌవనం దశరాత్రోషితం వయసమర్ధమాసే పిండాకృతిర్మాసే శరీరాకృతిర్మా సద్వయే శిరోబాహుప్రదేశాః త్రిమాసే జఠరకటిదేశాః చతుర్థే మాసే పాణిపాదద్వయం పంచమమాసే రోమకూపాణి షష్ఠేమాసేఽస్థిసంఘాతః సప్తమే మాసే జీవప్రకాశః అష్టమే మాసే సంపూర్ణదేహః నవమే మాసే ప్రచలనం కరోతి. అత ఊర్ధ్వం జాయతే స్నాయుమజ్జాస్థీని రేతోమయాని త్వగ్రక్తమాంసాని శోణితమయానితదేవషట్కోశ వికృతత్వ గ్రుధిరమాంసమేదోఽస్థిమజ్జా శుక్రమితి క్రమేణైకాంశిభూత సప్తధాతుమయం గాత్రంభవతి శుక్రాధికే పురుషశ్శోణితాధికే స్త్రీద్వయోస్తుల్యే నపుంసకం భవతి పుంసస్త్రీయోహ పరస్పరభావేన తయోరేకోగర్భస్య వర్ణ ఇతి విజ్ఞాయత ఇతి. తథాశ్రూయతే గర్భోపనిషది చ అన్యేన సప్తధాతూనాం శుక్రశోణిత సంభవత్వ ప్రకార ఉక్తః, తధా ప్రకృతి వికృతి భావనియత వాతపిత్తకఫాదిప్రపంచో నాడ్యాది· విశేషతత్పరిమాణాదయశ్చ తేష్వేవావసేయాః ఏవం జరాయుజాండజోద్భిజ్జ స్వేదజభేదోఽపిభావ్యః, ఏషాం చ వ్యష్టి జీవశరీరాణామీశ్వరం

వాదంబులును నిరస్తంబులు. యుక్తి బాధాద్యంశంబులు యధాసంభవమున నూహించు కొనదగినవి. ఇట్లు యింద్రియంబులకు ఏకాదశ సంఖ్యా వత్త్వంబును, అధిక సంఖ్యా నిషేధంబును చేయబడినది.

అవల తన్మాత్రసృష్టియన :- భూతంబుల కవ్యవహిత పూర్వావస్థా విశిష్ట ద్రవ్యము తన్మాత్రమనబడును. దధిరూపముగ బరిణతినొందు క్షీరమునకు మధ్యమావస్థయుంబోలె భూతరూపంబుగ బరిణమింపనున్న ద్రవ్యమునకు (అంతకు) పూర్వపుదగు నొకానొక యవస్థయే తన్మాత్రం బనందగు. అట్టి యవస్థావిశిష్టమగు ద్రవ్యంబును తన్మాత్రమే యనబడు చున్నది. ఇట్టిదే భూతోపాదానమగుటచే శబ్దాది గుణ మాత్రంబుచే భూత సృష్టి గలుగునని చెప్పగూడదు. విశిష్టశబ్దాదీ, విషయాధి కరణంబగునది భూతమనబడును. అట్టి భూతంబులందును పూర్వమునందువలె ప్రాకృతా ప్రాకృత విభాగ మెరుంగదగినది. తన్మాత్రములును భూతములును గూడ ప్రత్యేకమైదువిధంబులగుచున్నవి. శబ్ద స్పర్శరూప రసతన్మాత్రంబులనియు ఆకాశ వాయ్వగ్ని జలభూములనియు వీని నామంబులు అందు తౌమ సాహంకారాకాశంబులకు మధ్యమావస్థా విశిష్ట ద్రవ్యము శబ్దతన్మాత్రము ఇట్లే ఉత్తరోత్తర తన్మాత్రములందును ఆయాభూతద్వయ మధ్యమావస్థా విశిష్టద్రవ్యత్వము అవిశిష్ట తత్తద్గుణాశ్రయత్వము తత్తద్భూతో పాదనత్వము

ప్రతి శరీరత్వం సద్వారకమద్వారకం చేత్యేకే. సర్వావస్థానాం సర్వద్రవ్యాణామీశ్వరం ప్రత్యేవ స్వతశ్శరీరత్వం జీవం ప్రతి తు తత్కర్మకృతమిత్యన్యే.

యథాహ తాదృశీమవస్థాం మనుః. అసీదిదం తమోభూతమ ప్రజ్ఞాతమకల్మషం, అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః. తతస్స్వయం భూర్భగవానవ్యక్తో వ్యంజయన్నిదం, మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీత్తం మోనుద ఇతి.

ననునివి ఆయాతన్మాత్రల లక్షణంబుగ నెరుంగ దగినది. సర్శశూన్యమై విశిష్ట శబ్దాధారమును శ్రోత్రాఖ్యాయము, నయినది యాకాశము అవకాశ దావాదులచేనిది యుపకరించును. చక్షువులదెరచి చూచినంతటనే ఇది యాకాశంబును ప్రతీతి కలుగుచుండుటచే నీయాకాశము ప్రత్యక్షసిద్ధము. శాస్త్ర ప్రమాణంబుచే నాకాశమందు శబ్దమంగీకరించ బడుచున్నది. ఆకాశము నుండి స్పర్శతన్మాత్రమును దానినుండి వాయువును కలుగుచున్నవి. విశిష్ట స్పర్శయుతమై రూపశూన్యంబును అస్మదాది స్పర్శనయికేంద్రియ గ్రాహ్య ద్రవ్యంబును అనుష్ణాశీత స్పర్శవిశిష్టమై గంధశూన్యంబును అనునిది వాయులక్షణము. ఆవాయువునకు స్వభావంబువలన నేమి యదృష్టాత్మకం బగు నీశ్వర సంకల్పంబు వలన నేమి తిర్యక్ప్రసానిణము స్వారసికమై యున్నది. పార్థివాది ద్రవ్యంబులచే గాని వాయ్వంతరంబుచేగాని గలిగెడి యభిఘాతంబు వలన భ్రమణము ఊర్ధ్వగమనము మొదలగునవి తటస్థమగు చున్నవి. అయ్యవి తృణరజ్జు ప్రభృతి పదార్థములయొక్క భ్రమణోర్ధ్వ గమనంబులచే దూరస్థుడగు పురుషునిచే యనుమతింప దగియు సమీపస్థుడగుటచే స్పర్శ నేంద్రియము చేతనే గ్రహింపదగియును ఉన్నవి. ఇందువలన వాయువునకు నానాత్వంబును సిద్ధించుచున్నది. దీనికి పార్థివాదులచే యుపరోధము గలిగినపుడు స్తంభనము గలుగుచున్నది. (ఒక గాలితిత్తియందున్న వాయువునందిది వ్యక్తముగ దెలియవచ్చును) దీనికి మరియు సలిలాతప కుసుమాది యోగంబువలన శీతోష్ణ సౌరభారోపంబు గలుగుచున్నది. (ఇట్లే సలిలాది సంసర్గమందు వాయువు నందు శీతస్పర్శంబును తదభావమున నభావ ప్రత్యయంబును అన్వయ వ్యతిరేకములచే తెలియవచ్చునున్నది. కొందరాయుర్వేద ప్రవర్తకులు వాయువునందే శైత్యమాంద్యంబులను జెప్పినను దుందుభి స్వనాదుల యందు దురూహంబగు వస్తు శక్తి నవలంబించ వలసి వచ్చుటచే నయ్యది స్వభావము ప్రభావమునని యాయా యెడల వారలచేతనే అంగీకరింప బడుటచే నావాదంబును

యథా వా తం పురుషం భగవాన్ శ్రీశుకః. 'అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే, సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవ' ఇతి. యథా వా తయోర్వ్యివృతౌ మదీయ ఆచార్యస్తవే. నాహర్నక్షణదా నఖం న ధరణిర్నధ్వాన్త మాసీద్యదాన జ్యోతిర్న చ వస్తు లభ్యమపరం శ్రోత్రాది బుద్ధ్యా తదా, యన్నిర్విక్రియ మచ్చ మక్షర మనన్యాధీన మే కాకృతి స్వైరం సత్రిగుణం సపూరుష మభూద్వైఖానసాఖ్యం మహ' ఇతి.

-

సమంజసమైనది కాదు. ఇయ్యది త్వగింద్రియము నాప్యాయనముజేయుటచే ప్రాణశరీర విషయాత్మకంబుగ నుపకరించు చున్నది. అందును శరీరధారణాది హేతువిశేషంబగు నట్టిదియు నీవాయు విశేషంబే యగుచున్నది. ఇది ప్రాణమనంబరంగును. ఇట్లు వ్యాపార భేదంబుచే నిదియైదు విధంబులుగను పది విధంబులుగను విభజింప బడుచున్నది. ప్రాణాపానవ్యానోదాన సమానంబులనియు, వీనితో జేరి నాగకూర్మ కృకర దేవదత్త ధనంజయము లనియు వీనినామములు, ఈ ప్రాణ శబ్దము వాయు సామాన్యమందు వాయు విశేషమందును గూడ వాడబడుచున్నది. జంగమ శరీరమందు వలె స్థావర శరీరములందు ప్రాణము గలదు. ఉదకసేచనము సేయుట దోహదము సేయుట మొదలగు పనులచే వృద్ధినొందుట వలన నీ ప్రకారము స్పష్టపడుచున్నది. నఖదంత రోమకిణాదుల యందును మంద ప్రాణాశ్రయత్వ ముండియేయున్నది. (కిణముకాయకాచుట). ఈ వాయువునకే రేచక పూరక కుంభకాది విభేదంబులచే నష్టాంగయోగమందులి ప్రాణయామమువలన నియమనము విధింపబడుచున్నది. శరీరోపాదాన భూతంబుగువాయువన్నో యిట్టి ప్రాణ వాయువు కంటె వ్యతిరిక్తమైనది. ఇదియే ప్రాణాత్మకంబుగ వాయుతత్త్వము నందలి యుపకరించుట యనదగినది. వాయూపాదానత్వంబు వాయు ప్రాచుర్యంబు వలన మారుతాది శరీరములందు కనదగును. ఇది శరీరాత్మక మగునుపకారము. చండవాత తాళవృంత పవనాదులయందు విషయత్వ ముండు నిది విషయాత్మకమగు నుపకారంబని యెరుంగునది. ఈ వాయువు నుండి రూపతన్మాత్రంబును అందుండి తేజస్తత్త్వమును గలుగుచున్నవి. ఉష్ణస్పర్శవత్త్వము, భాస్వరరూపవత్త్వము మొదలగునవి తేజస్తత్త్వ లక్షణము. ఇయ్యది వాక్చక్షువుల కాప్యాయకము, దివాభీతాది వ్యతిరిక్త లోచనంబులకును అంజన విశేషాది శూన్యలోచనంబులకును తిమిరాద్యతి రిక్త విషయ ప్రత్యయోత్పాదనమునందు విశేషమహత్త్వంబు గలిగినట్టియు పూర్వోక్తమగు నాప్యాయనము కంటె యన్యమైనట్టియు నొక్క తేజః పదారము అపేక్షితమగుచున్నది. అదానియుపకారంబును

విస్తరస్తు శ్రీభాష్యాదౌ ద్రష్టవ్యః. 3. ప్రకృతమనుసరామః తదేవాహ లీనామిత్యాదినా స్పష్టోర్థః జీవరాశి సమూహకమిత్యపిపాఠః. తత్రాచేతనాయాః ప్రకృతేశ్చేతనాధిష్ఠితత్వావశ్యంభావం నిశ్చిత్య జీవానాం జీవాత్మనా మపీ శితృత్వం భగవత్యుపదిశతి జీవేశ ఇతి. 4. తాదృశచింతా ప్రకారోపన్యాసప్రస్తావే తదుపబృంహణార్థాం శ్రుతిమాహ శ్రుతిరితి. ఇత్థం హి శ్రూయతే ఛాందోగ్యే షష్ఠాధ్యాయే ద్వితీయఖండే. సేయం దేవతైక్షత హన్తాహమిమాస్తిస్రోదేవతా అనేన జీవేనాత్మనాऽను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి సేయం దేవతేమాస్తిస్రో దేవతా అనేనైవ జీవే నాత్మనాऽను ప్రవిశ్య నామరూపే వ్యాకరోదిత్యాది అర్థస్సూత్రరత్ర విచార్యతే. 5.

ప్రాణాది సంయోగము వలన నశితపీతంబులకు పాకాది హేతువగు తేజో విశేషము వైశ్వానరంబన బడుచున్నది. శరీరత్వంబును దహనతపనాది తేజః ప్రచుర శరీరములందును విషయత్వంబును చంద్రికా శతహ్రదా (మెరుపు,) హుతవహాదులందును చూడనగును. ఇట్లు ఆప్యాయకత్వ, వైశ్వానరత్వశరీరత్వ విషయత్వం బులను నాలుగు విధంబుల తేజస్తత్త్వము యొక్క యుపకారము చెప్పబడినది. మరియు భౌమంబనియు దివ్యంబనియు నీతత్త్వము ద్వివిధము. ప్రదీపాదులు భౌమంబును, అదిత్యాది జ్యోతిర్మండలంబులు దివ్యంబులు ననంబడును. ఇట్లే ఔదర (జఠరవహ్ని) మనునదియు తత్త్వభేదమే యగుచున్నది. మరియు నియ్యది ప్రభయనియు ప్రభావంతమనియు రెండు తెరంగులుగ విభజింపబడుచున్నది. సామగ్రీ విశేషాదీవ స్వభావభేదంబు వలన తేజస్సునకే శోకహర్ష శోషణవృద్ధి పాకప్రకాశాది జనకత్వ తార తమ్యము సిద్ధించుచున్నది. సౌరతేజమునందు శోక శోషణ హేతుత్వము, చాంద్ర తేజమునందు హర్షజలవృద్ధ్యాది హేతుత్వము అగ్నేయమునందు పాకాది హేతుత్వము ననునవి దృష్టములు, దీనికి ఊర్ధ్వజ్వాలనము సహజమైనది. ఇది రోహిత భాస్వరైక రూపంబయ్యు సలిలాది, సంసర్గ భేదంబున వర్ణవైచిత్ర్య విశిష్టంబై దోచును. తేజస్సునుండి రసతన్మాత్రం బును అందుండి యాపస్తత్త్వంబును గలుగు చున్నది. శీతస్పర్శవత్త్వము, నిర్గంధత్వమైన విశిష్టరసవత్త్వము ననునివి యాపస్తత్త్వ లక్షణము, శుక్లమధుర శీతతైక స్వభావంబగు దీనికి సంసర్గ భేదంబువలన రూపరస స్పర్శ వైచిత్ర్యారోపము గలుగుచున్నది. దీనికి ద్రవత్వము స్వాభావికము, అప్యంబులైన కరకాదులయందు ప్రతిఘాతవ శంబున కాఠిన్యమేర్పడుట గూడ కలదు. (కరకమూऽవడగండ్లు) ఇయ్యది ప్రాణరసనాప్యాయనాది రూపముగ నుపకరించుచున్నది. శరీరత్వమును జలప్రచురములగు వరుణలోక శరీరములందును విషయత్వమును సరిత్స

నిద్రాణస్య మహాన్ కాలోగతస్తస్య మహాత్మనః
సతుకాలాంతరే విష్ణుర్భగవాన్ భక్తవత్సలః 3
యోగనిద్రాం పరిత్యజ్య దృష్ట్వా ప్రకృతిమాదరాత్

5.ఇతి సంస్మరణాదితి స్మరణాదన న్తరమిత్యర్థః. అత్ర విమానార్చన కల్పే భగవాన్మరీచిః. ఏకదా ప్రలయకాలే భుజంగపతిభోగపర్యంక శయితస్య నారాయణస్య నాభికమలే బ్రహ్మోద్భవ ఇతి.

బ్రహ్మాన్నితి అత్రవిమానార్చనకల్పం యదా యదా ప్రజాస్సృజేయేతి సోకామయత తదా స్వాభిమతానురూపగుణస్వశక్త్యాలీల యేమం ప్రపంచం కార్యకారణభావేన యథా పూర్వం ససర్జేతి వదతిశ్రుతిః.

ముద్రాదులందును కనదగును. ఉదకములనుండి గంధతన్మాత్రంబును అందుండీ పృథివియు గలుగుచున్నవి. విశిష్ట గంధవత్త్వము. విశిష్ట స్పర్శవత్త్వము ననునిది పృథివీ లక్షణము. ఆదియందు సురభిమధుర కృష్ణానుష్ణ శీత స్పర్శముగ నుదయించినను అనుష్ణ శీతత్వము సర్వకాల సర్వావస్థలయందనువర్తించుచున్నది. తేజస్స లీల స్పర్శో పాధ్యన్వయ వ్యతిరేకంబుల వలన నౌష్ణ్య శైత్యోపలంభము స్పష్టమగుచున్నది. కృష్ణవర్ణము సహజ సిద్ధమైనను పాకభేదంబువలన విచిత్ర వర్ణంబుగ నొప్పుచున్నది మరియు నిది కఠినమయ్యును సలిలతాపాది యోగంబువలన ద్రవత్వోప లంభంబును కలుగుచున్నది. మనోఘ్రాణాప్యాయనాదులచే నిద్దాని యుప కారము శరీరత్వము మనుష్యతిర్యక్ స్థావరాదులయందును విషయత్వము మృత్పాషాణ తిమిరాదులయందును చూడనగును. అబాధిత నీలాది ప్రత్యయ విషయంబగుట వలన నీ తిమిరంబు ద్రవ్యంబును పార్థివంబు నయియున్నది. ద్రవ్యమును పార్థివమును అయ్యు స్పర్శానుపలంబాది చోద్యము నొకప్పుడు ఇంద్రనీలాలోకాదుల యందు వలె నిర్వహింపదగినది. ఇయ్యది ఆగమసిద్ధము. తత్త్వాంతరంబులంబోలె సృష్టి ప్రలయ ప్రకారంబులును శ్రుత్యుక్తములుగ దెలియవచ్చు చుండుటచే నియ్యది ద్రవ్యంబని సిద్ధాంతింపబడియున్నది. ఈవిధంబుగ తత్త్వంబు లిరువది నాలుగు వివరింపబడియున్నవి. మరియు సృష్టి ప్రకారమొక్క యెడ నాకాశపూర్వకంబును వేరొకయెడ తేజః పూర్వకంబుగను ఇట్లు పలువిధంబుల శ్రుతులందు జెప్పబడినను అయ్యవి మహదహంకారాది పూర్వకంబుగ పై జెప్పబడిన సృష్టిక్రమమును విరోధింపజాలవు. శ్రుత్యంతరంబు వలన ప్రకృత్యాది సృష్టియు పఠింపబడుటచే శ్రుతివై

తత్రాహమంశభాగేన నరనారాయణావృషీ
అవతారం కరిష్యామి తత్ర మామర్చయ ప్రియ 27

మత్ప్రియే నైమిశే రమ్యే మదాజ్ఞాం పాలయంత్సదా
భృత్యైశ్చ పూజితో నిత్యం నారాయణపరాయణః 28

శిష్యైశ్చ సహ కర్తవ్యం సూత్రం లోకహితం మహత్
దైవికం మానుషం చైవ సూచితం సఫలీకురు 29

విఖనసా సూత్రప్రణయనమాహ నైమిశ ఇతి. నైమిశేఽనిమిషక్షేత్ర ఇతి భగవాన్పరాశరోఽపి. బ్రహ్మణా నిసృష్టస్య మనోమయస్య నేమిశ్శీర్యతే కుంఠీభవతి యత్రతతం నేమిశం నేమిశమేవ నైమిశం తథా చ వాయవీయే ఏతన్మనోమయం చక్రం మయాయత్ర విసృజ్యతే, యత్రాస్య శీర్యతే నేమిస్తద్దేశ స్తపస్సుశ్శుభః. ఇత్యుక్త్వా సూర్యసంకాశం చక్రం సృష్ట్వా మనోమయం, ప్రణిపత్య మహాదేవీం విససర్జ పితామహః. తేఽపి హృష్టతరా విప్రాః ప్రణమ్య జగతాం ప్రభుం ప్రయయుస్తత్ర చక్రస్య యత్ర నేమిర్వ్యశీర్యత తద్వనంతేన విఖ్యాతం నైమిశం మునిపూజితమితి. నైమిష ఇతి పాఠే వరాహ పురాణోక్తం ద్రష్టవ్యం తథా హి గౌరముఖమృషిం ప్రతి భగవద్వాక్యం ఏవం కృత్వాతతో

జేసికొని నాభక్తుల నితరులను సైతమెందరినో తరింపజేయగలడు, 21. అశుచియైనను అనాచార రతుడయినను జాతిచేత గాని విద్యచేతగాని యధముడైనను నాపాదోదకమును ధరించుటచేతను నాకు నివేదితములగు బదార్థములను భుజియించుటచేతను ఆ నరుడు సమస్తపాపములనుండి విముక్తుడై కడపడ నాసాయుజ్యమును గూడ బొందుచున్నాడు. 22. వాని యొక్క జన్మజన్మాన్తరార్జితంబగు పాప సమూహమునంతను దవానలము తూలరాశినింబోలె (నాయనుగ్రహమనునది) దహింప జేయుచున్నది. కావున నాభక్తుడగు వాని కెన్నడు నెట్టికొరతయును లేదు. కావున నాయర్చనము సేయుటయందు నీవు భయపడదగిన యెట్టిలోపమును గలుగదు. (ఇయ్యాది ప్రపంచోప కారంబనుట) 24. సాధువులరక్షించుటకై భూలోకమందు శ్రీ భూసమే తుండనయి నేనవతరించు చున్నాను. 25. ఓ పుత్రశ్రేష్ఠమా నాయాజ్ఞను వహించిన వాడవయి నీ విపుడే నీ యనుచరులగు భృగ్వాది మునీంద్రులతో గూడి భూలోకమందు విఖ్యాతిగాంచినట్టియు తపస్సు నాచరించుటకు సర్వోత్తమ మైనట్టియు ఉచితమైన దగుటచేతనే ఫలప్రద

అర్చా విగ్రహరూపేణ యత్రయత్ర వసామ్యహం
త్వత్సూత్రిణస్తత్ర తత్రమునే మామర్చయన్తుతే 30

త్వత్సూత్రిణాంచ సర్వేషాం సదా మత్కృతకర్మణాం
మదాజ్ఞాపాలకానాం చ పునర్జన్మనవిద్యతే 31

అభీతస్త్వం మహాభాగ విఖనోమునిపుంగవ
భృగ్వాదిమునిభిస్సాకం మదారాధనకృద్భవ 32
(మచ్చరిత్రతయా సత్యమపచారో న విద్యతే)

ఇత్యుక్తే దేవదేవేశే విఖనా మునిపుంగవః
సత్యవాక్యేన సంతుష్టస్తదాజ్ఞాం శిరసా వహన్ 33

ప్రదక్షిణం తదాచక్రే శిష్యైరేతైస్సమావృతః
భగవన్తం ప్రణమ్యాథ నైమిశం ప్రవివేశ హ. 34

స్వాయంభువమనోః కాలే యుగాదౌ శుకవత్సరే
శ్రవణే శ్రావణే శుక్ల పూర్ణిమాసోమవాసరే
సింహలగ్నేన సంయుక్తే విఖనాః ప్రాపనైమిశం. **36**

నైమిశే నిమిషక్షేత్రే శిష్యైశ్చ సహితో మునిః
వైఖానసస్సహర్షేణ సూత్రం కర్తుం ప్రచక్రమే 37

దేవో మునిం గౌరముఖం తథా, ఉవాచ నిమిషేణేదం నిహతం దానవం బలం. అర ణ్యేऽస్మింస్తత స్త్వేతన్నైమిషారణ్యసంజ్ఞితం. భవిష్యతి యథార్థం వై బ్రాహ్మణానాం విశేషక

మైనట్టియు నైమిశారణ్యమును విభవావతారంబుతోడ ప్రవేశింపుము. 26. నేను ఆయాలోకమందే నైమిశారణ్యమునందు నాయంశముచే నరనారాయణ స్వరూపముల ధరియించి విభవావతారంబున నవతరించ బోవుచున్నాను. ఓ కుమారా! నీవు నన్నప్పుడచట నర్చించుము. 27. నాకును బ్రియ తమంబగు నైమిశారణ్యమునందు నాయాజ్ఞను భావింపుచు (భూలోక వాసంబుచే ననవధానము చెందకుండననుట) నీకు భృత్యులగు ననేకులగు

వైఖానసేన మునినా ద్వాత్రింశత్ప్రశ్నసంఖ్యయా
నిషేకాదిశ్మశానాన్తం మానుషం కర్మ సూచితం 38.

సూత్రం విఖనసా ప్రోక్తం సార్ధకోటి ప్రమాణకం
కర్షణాద్యుత్సవాన్తం దైవికం తేన సూచితం 39.

మితి అనిమిషశ్శ్రీవిష్ణుః అలుప్తదృష్టిత్వాత్ తస్య క్షేత్రే, ఇతి తథా. కలిమాగతా యాజ్ఞాయ క్షేత్రేఽస్మిన్వైష్ణవే వయమిత్యస్మిన్నే వాధ్యాయ ఇతి తత్రవ్యాఖ్యానే పరిదృశ్యతే. 37. విఖనసా ప్రణీతం సూత్రం గణయతి ద్వాత్రింశదితి, నిషేకాదిశ్మశానాన్తం స్మార్తం శ్రౌతం ధర్మంచ సూత్రితం. తత్ప్రశ్నానుబంధినశ్చతురో మంత్రప్రశ్నానపి సమాచకలదితి భావః. 38. సూత్రిత మితి దైవికమిత్యనేన విశేష్యతే. పూర్వసూత్రవద్దైవికమపి సూత్రం కర్షణాద్యుత్సవాన్తం సార్ధకోటి గ్రంధజాతం విఖనసాప్రోక్తమిత్యన్వయః, ఏతచ్చ పూర్వవత్తదనుబంధి స్వసంకలిత మంత్ర ప్రశ్నానాం చతుర్ణామప్యుపలక్షణం. శ్రౌతసూత్రస్యతు సుగమ స్సార్వజనీనః పన్థాః ఉత్సవాన్త మిత్యుపలక్షణం ప్రాయశ్చిత్తస్యాపీతి ప్రాగుక్తం. 39. తదేతద్దైవికం సూత్రమతిగభీరమితి కృత్వా భగవదంతరంగ శిష్యై స్సబ్రహ్మచారిభి రస్మాభిశ్చతుర్భి స్సంక్షేపః కృత ఇత్యాహ గురోరితి.

మహర్షిపుంగవుల చేతను ప్రభువులచేతను లోకంబుల చేతను పూజింపబడుచు. నిరంతరము నారాయణపరాయణుండవయి నివసింపుము, 28. ఓ కుమారా! నీ శిష్యులతోజేరి నాచేపూర్వముపదేశింపబడిన రీతిని లోకహితార్థమై దైవిక మానుష రూపమగు నుభయకర్మ ప్రతిపాదకంబగు సూత్రంబును బ్రణయనముసేయుము. 29. అర్చావిగ్రహుండనయి నేను భూలోకమందెచ్చటెచ్చట నవతరింప బోవుచుంటినో యచ్చటచ్చట నీ సూత్రము నధ్యయనము జేసిన నీ సూత్రజ్ఞులే నన్నారాధనము సేయు చుండవలయును (కావున నాయవతారమునకు ముందే యర్చకులను నీవు సిద్ధము చేసి యుంచవలయుననుట) 30. నాచే చేయబడిన కర్మలు గలవారలగుటచే నీ సూత్రజ్ఞుల కందరకును నా యాజ్ఞాపరిపాలకు లగుటచే పునరావృత్తిరహితమగు నుత్తమపదమును నేనొసంగెదను. 31. ఇట్లు గర్భమందే వారలను వైష్ణవులజేసి యసంశయముగ నుత్తమలోక ప్రాపణము వరకును వారల గాపాడెదనని నేనభయం బిచ్చు చుంటిని. గావున నీవీయభయ దానమునందు విస్రబ్ధుడవై యోమునిసత్తమా! నీ పుత్రులగు భృగ్వాదులను సైతము వెంటనిడికొని నాయారాధన

గురోర్ముఖాచ్చ సంగృహ్య తత్సర్వం సముదాహృతం
కాశ్యపేనాత్రిణా చైవ మయా చ భృగుణా తథా 40

చతుర్లక్షప్రమాణేన సంక్షిప్య ప్రోచ్యతేఽధునా
తత్త్రమంచ ప్రవక్ష్యామి శృణుధ్వం మునిసత్తమాః 41

గురోర్విఖనసఃతత్సర్వం సముదాహృతమితి తస్మిన్మహతి విస్తృతే గ్రంథేన కోఽప్యంశో ర్వానూదితో హాపిత ఇతి భావః కాశ్యపేనేతి. సంక్షేపకర్తృణాం నామాని చత్వారి. 40. సంక్షిప్తగ్రంథగణమాహ చాతుర్లక్షేతి. 40. చాతుర్లక్షపరిమితం గ్రంథం చతుర్షుమహర్షిషు

పరుడవుగమ్ము. 32. ఇట్లని భగవానుని యనుమతిని వడసి విఖనసుండును భగవానుని సత్య వాక్యముచే సంతుష్టాంతరంగుడగుచు తదాజ్ఞను శిరసావహించి స్వశిష్యపరివృతుండై దేవదేవునకు బ్రదక్షిణప్రణామములజేసి నైమిశారణ్యమును బ్రవేశించెను. **34.** **స్వాయంభువమనువు నొక్క కాలమందు కృతయుగాదిని శుక్లనామసంవత్సరమున శ్రావణమాసములో శ్రవణనక్షత్రయుక్త పూర్ణిమాదివసముతో గూడిన యిందు వాసరము నాడు సింహలగ్నమందు శ్రీ విఖనోమునీంద్రులు నైమిశారణ్యమునం దవతరించిరి. శ్రీ విఖనస మహాగురవే సపరివారాయనమః** **36.** వైష్ణవ క్షేత్రంబని ప్రసిద్ధిజెందిన నైమిశారణ్యమందు శిష్యజనపరివృతుండై విఖనసుడు హర్ష యుక్తుడై శ్రీసూత్రప్రణయనము జేయనారంభించెను. 37. అట్లే విఖనసునిచే నిషేకాది శ్మశానాన్త కర్మలను ప్రతిపాదించునట్టి శ్రౌతస్మార్త ధర్మ సూత్రములు గల మానుషసూత్రము ముప్పదిరెండు ప్రశ్నలలో పరిపూర్ణముగ జెప్ప బడియె (ఇయ్యది శారీరమంత్రప్రశ్న చతుష్టయంబున కుపలక్షణము) 38. మరియు నిట్లే కర్షణాద్యుత్సవాంతంబగు దైవిక కర్మయు సార్ధకోటి (నూటయేబదిలక్షల) గ్రంథముగ విఖనసునిచే జెప్ప బడియె (ఇయ్యది దైవిక మంత్రప్రశ్న చతుష్టయమున కుపలక్షణము మంత్రములు దృష్టములు కాదగును. 39 ఈ సూత్రమును గురుశ్రేష్ఠుడగు విఖనసునివలన నుపదేశింపబడిన వారలమై కాశ్యపుడు అత్రి. నేను (మరీచి) భృగువునను నీనలువురు ఋషులచే సంక్షేపముగ నాలుగులక్షల గ్రంథముగ జేయబడి యిప్పుడు మీకుపదేశింపబడుచున్నదని యెరుంగ

జయానందం చ సంజ్ఞానం వీరం చ విజయం తథా
విజితం విమలం కల్పం మయైవం సంహితాష్టకం 42

విభజతే తత్త్వమితి. 41. జయమానందం చ జయానందం జయానన్ద ' ఇత్యపి పాఠః. సంజ్ఞానం, వీరం, విజయం, విజితం విమలం, కల్పమిత్యష్టౌ సంహితాస్సంహితాష్టకం లక్షోపరి చతురశీతిసహస్ర గ్రంథం (104000) మయా మరీచినా కృతం. జయసంహితాయా ఏవాదిసంహితేత్యపి పర్యాయః కల్పమితి విమానార్చ న కల్పముచ్యతే. ఏతాస్సర్వా అష్టౌ సంహితాశబ్దాభిహితా భవన్తి. 42. భృగుప్రోక్తం గ్రంథమాహ ఖిలమితి. ఖిలం, ఖిలాదికారం పురాధికారం, వాసాధికారం, అర్చాధికారం, మానాధికారం, క్రియాఽధికారం, నిరుక్తాధికారం, ప్రకీర్ణాధికారం, యజ్ఞాధికారమితి దశగ్రంథాన్ భృగుః ప్రణినాయేతి శేషః. ఖిలమేవ పురాతంత్రమితి వ్యవహ్రియతే అత్రవక్తవ్యం మరీచిప్రోక్తే విమానార్చనకల్పే శాస్త్ర రహస్యపటలే ప్రతిపాదితమితి విశేషస్తు తోఽనుసంధేయః

దగినది. (నూటయేబది లక్షల గ్రంధము దురారక్షంబని యెంచియు దుర్గ్రహంబని తెలిసియు నందలి తత్త్వమును కొంచెమేని విడువక మాస్వవచనంబులచే నీ నాలుగు లక్షల గ్రంధమును జెప్పితిమని భావము.) 40. జయము, ఆనందము, సంజ్ఞానము, వీరము, విజయము, విజితము, విమలము, కల్పము నను నీయెనిమిది సంహితల లక్ష యెనుబది నాలుగువేలు సంఖ్యగల గ్రంథముగ నాచే జెప్పబడినది. (జయ సంహితకే యాదిసంహిత యనియు నామాంతరము కల్పమనిన విమానార్చన కల్పమని యర్థము. నామైకదేశ గ్రహణంబుచే నామ గ్రహణమని సిద్ధాన్తముతీరున నిదియే కల్పశబ్దార్థము) 42. ఖిలము ఖిలాధికారము, పురాధికారము, వాసాధికారము, అర్చాధికారము, మానాధికారము, క్రియాధికారము, నిరుక్తాధికారము, ప్రకీర్ణాధికారము, యజ్ఞాధికారము నను నీపదియధికారములును భృగువుచే యరువది నాలుగువేల గ్రంధముగ జెప్పబడినది. (మొదటిదగు ఖిలమునే పురా తంత్రమనియు వ్యవహరించుట సంప్రదాయము) 45. పూర్వతంత్రము, విష్ణు తంత్రము, ఉత్తరతంత్రము మహాతంత్రము నను నీ నాలుగు తంత్రములును అత్రిచే యెనుబది యెనిమిది వేల గ్రంథముగ చెప్ప బడినది. (పూర్వతంత్రమునే సమూర్తార్చనాధి కరణమనియు వ్యవహరించుట

చతురశీతిసాహస్ర లక్షో పరికృతం తథా
ఖిలం ఖిలాऽధికారం చ పురాధికరణం తథా 43

వాసాధికరణం చైవ హ్యర్చాధికరణం తథా
మానాధికరణం చైవ క్రియాధికరణాహ్వాయం 44
నిరుక్తం చ ప్రకీర్ణంచ యజ్ఞాధికరణం తథా

అధికార ఏవాధికరణం అధికారశబ్దస్యైన ప్రచురః ప్రయోగోऽత్ర భార్గవేషు గ్రంధేషు దృశ్యతె, తత్సంఖ్యాచ చతుష్షష్టిసహస్రం (64000) 45. **తతోऽత్రి ప్రోక్తం** గ్రంధమాహ, పూర్వంతం త్రేతి. పూర్వ తంత్రం విష్ణుతన్త్ర ముత్తరతన్త్రం మహామన్త్రమితి తంత్ర చతుష్టయం చతురోऽగ్రంథా నత్రిరుక్తవాన్ తత్రాప్యధికరణశబ్ద వ్యవహారో దృశ్యతే సమూర్తార్చనాధికరణమితి యథా. ఏవంచ తంత్రమధికరణ మితి ద్విధా తత్ర వ్యహారః. తత్సంఖ్యా చాష్టాశీతి సహస్రం ( 88000) 46. తతః **కశ్యపప్రోక్త** గ్రంధమాహ సత్యకాండమితి సత్యకాండం, కర్మకాండం, జ్ఞానకాండమితి కాండత్రయంత్రీన్ గ్రంథాన్ కాశ్యపోऽబ్రవీత్. మహదితి సనాతనం కాండముచ్యత ఇతికేచిత్. జ్ఞానకాండస్యైవ సనాతనకాండ ఇతి పర్యాయ ఇత్యపరే. తత్సంఖ్యా చతుష్షష్టిసహస్రం (64000) 47. అతః పరమష్టా వింశతి సహస్ర గ్రంథం కాశ్యపేనాధికం కృతం చతుర్లక్షగ్రంధాదిత్థం విభక్తాదర్వాగితి భావః (28000) ఇదమేవ సనాతనం కాండంస్యాదితి సంప్రదాయః తథాऽర్చాప్రకరణ మిత్యపిసనాతన కాండస్య తత్రతత్ర భాష్యాదిషు బహుశ ఉదాహృతత్వం చ ప్రసిద్ధం. 48 ఏషాం చతుర్విధానాం, సంహితాऽధికార, తంత్ర, కాండ, శబ్దితానాం గ్రంథ విశేషాణాం సర్వేషామపి మూలం తస్యగురోర్విఖనసస్సూత్రం ప్రాగుక్తం సార్థకోటి ప్రమాణక మేవేత్యాహైతేషామితి. 48. అథ భగవదవతారమాహ క్వచిదితి. క్వచిత్ ఏతత్సూత్రశాస్త్రాదికం ప్రణీయసర్వత్ర భూమ్యామస్య

సంప్రదాయము). 46. సత్యకాండము, కర్మకాండము, జ్ఞానకాండము, నను నీమూడు కాండములను కశ్యపునిచే నరువది నాలుగువేల గ్రంథముగ జెప్పబడినది. (సత్యకాండమునే కొందరు సనాతనకాండ మనియు తలచెదరు. 47. ఈ యరువది నాలుగు వేల గ్రంథము మాత్రమే గాక వేరుగ నిరువది యెనిమిదివేల గ్రంథమును కశ్యపుడు రచియించెను. ఇయ్యది పైజెప్పిన చతుర్లక్ష పరిమిత గ్రంథము కంటె వేరైనది గావునఅధికముగనని జెప్పబడినదని భావము. (దీనినే సనాతన కాండమని పిలుచుట సంప్రదాయ శిష్టమై యున్నది. దీని యందర్చావిధానంబును సనాతన పదార్థవిచారంబును జేయబడి యుండనోపును.

భృగుణా చ చతుష్షష్టి సహస్రం సముదాహృతం 45
పూర్వతంత్రాహ్వాయం చైవ విష్ణుతన్త్రమతః పరం

ఉత్తరాఖ్యం మహాతంత్రం ప్రోక్తంతంత్ర చతుష్టయం
అష్టాశీతిసహస్రంతు గ్రంధానామత్రిణా తథా 46

సత్యకాండం కర్మకాండం జ్ఞానకాండాహ్వాయం మహత్
చతుష్షష్టిసహస్రం తు గ్రంధం ప్రోవాచ కాశ్యపః 47

అష్టావింశతిసాహస్రం కాశ్యపేనాఽధికం కృతం
ఏషాం చతుర్విధానాం తు మూలం తత్సూత్రముచ్యతే 48

క్వచిత్కాలాన్తరే విష్ణుర్నరనారాయణావృషీ
బదరీషండమాసాద్య లోకరక్షాం చకార హ 49

తస్యాఽవతారం జ్ఞాత్వాతు విఖనా మునిపుంగవః
తత్ర గత్వా జగన్నాధం నరనారాయణాత్మకం 50

ప్రణమ్య శిరసా భూమౌ శ్రీవిష్ణోరాజ్ఞయా మునిః
ఆరాధనం తదాచక్రే యదర్థమవతారితః 51

మార్గస్య సుష్టుప్రతిష్ఠాపనా దనన్తరం బదరీషండమితి. అయంభగవతోఽర్చారూపేణావతీర్ణస్య ప్రథమావాసః 49. 51. అతస్సర్వత్ర భూమ్యాం భగవతోఽర్చారూపేణావిర్భావమాహ తదేతి. యత్రయత్రావిర్భావో బింబాదిషు భగవతాఽనుమన్యతేతత్ర తత్ర తత్ప్రతిష్ఠాత్రా యజమానేన

ఈసనాతనకాండముయొక్క సత్తాజ్ఞానము గూడ భాష్యకారోదాహరణంబు మూలము నను సంప్రదాయము వలనను సిద్ధము) 48. ఈ నాలుగు విధంబగు గ్రంథజాతంబునకును మూలము. విఖనసప్రోక్తమగు సార్ధకోటి ప్రమాణంబగు శ్రీశాస్త్రమే అయి యున్నది. 48. ఇట్లు సూత్రప్రణయనము జేయబడి వ్యాప్తిచెందిన వెనుక నొకానొక శుభకాల మందు లోకరక్షాపరుండగు విష్ణుదేవుడు నరనారయణ రూపియై భూలోకమునం దవతరించిన వాడాయెను. **శ్రీమతే** నాారాయణాయనమః, 49. ఇట్లు భగవానుడవతరించిన రహస్యం బెరింగిన విఖనసుండును బదరి కారణ్యమునకుజని నారాయణ స్వరూపియగు జగన్నాధునిజేరి

తదా ప్రభృతి దేవేశో లోకసంరక్షణాయ వై
యత్ర యత్రైవభూమ్యాంతు ? అర్చారూపేణవిద్యతే 52
తత్ర తత్రత్యభూపేన చానునీతా స్తదాజ్ఞాయా
వయం వైఖానసా విప్రాః పుత్రపౌత్రాదిభిస్సహ 53
ఆరాధయామో లక్ష్మీశమాచార్యానుగ్రహాత్తథా
శ్రీపుండ్రాఖ్యం మహాగ్రామం సంప్రాప్య తదనన్తరం 54
చోళభూపేన చానీతా ధార్మికేణ మహాత్మనా
స్థాపితాశ్చ భవిష్యన్తి విస్తృతా విష్ణుపూజకాః 55
ఏషవః కధితో విప్రా అస్మదాచార్యసంభవః
యశ్శృణోతి పఠన్వాపి సయాతి పరమాం గతిం. 56

భగవదుద్బోధితేన వయం విఖనసశ్శిష్యాః ప్రశిష్యాశ్చ తత్ర భగవన్తమారాధితుమాహూతా ఆనీతాశ్చ వర్తామహ ఇతి భావః, తదాజ్ఞయా భగవదాజ్ఞయా. 53. తతః ప్రభృతి కైంకర్యవృద్ధిమాహ వయమితి. 54. ఇత్థం వృత్తం వర్తమానం చోక్త్వా ప్రసంగా దేష్యత్కథాం ప్రస్తౌతి శ్రీపుండ్రేతి కోఽయంగ్రామ ఇతి చారిత్రకం ప్రమాణం మృగ్యతే. 55. అథైతదాఖ్యానక కధనస్య ఫలకథనేన ప్రకృతముపసంహరత్యేతదితి, పరమాంగతిం చప్రాప్నోతి. న కేవలం చరిత్రాన్తరాదిభ్య ఇవ కలికల్మషనాశన మైహికఫలలాభమాత్ర మిత్యాద్యేవేతి భావః. 56. తథామదీయే ఆచార్యస్తవే. యోభృగ్వత్రిమరీచి కశ్యపముఖాంశాస్త్రప్రతిష్ఠాపికాం, లక్ష్మీకృత్య పరంపరాదు చకథలక్ష్మీశపూజా విధిం. అద్వైతం చిదచిత్త్వకారకతనా వాఖ్యాపయద్బ్రహ్మణో నిర్వాణైకనికేతనం విజయతేయోగీస వైఖానసః ఇతిః అత్ర భగవద్విఖనస్సంవాదశేషః విఖనసో విభవావతార శ్రీశాస్త్ర ప్రణయనం తత్ప్రమాణం భగవతోఽర్చారూపేణావతరణమిత్యంశాః ప్రతిపాదితాః ఆహత్య శ్లోకానాం సంఖ్యా సార్ధపట్పంచాశత్ త్రుటితస్సార్థశ్లోకో గ్రధితః కుండలీకృతశ్లోకో నగణితః.

సాష్టాంగదండ ప్రణామంబులా చరించి మరల భగవానుని యనుమతిం గొని యారాధనము జేసిన వాడాయెను, తానే యారాధన కైంకర్యమును జేయనవతరించెనో విఖనసుడా ప్రయోజనమును నిర్వర్తించి కృత కృత్యుడాయెను. 51. ఆ నాటనుండియు లోకరక్షణార్థమై భగవానుడెచ్చట నర్చారూపియై యావిర్భవించుచుండునో అచ్చటచ్చట యజమానులగు ప్రభువులచే నాయాస్థలములకు సమర్యాదముగ దొడ్కొని పోబడి

ఇత్యార్షే శ్రీ వైఖానసే మరీచిప్రోక్తాయా మానన్దసంహితాయాం
(విఖనసోవిభవాఽవతార కథనం నామ) సప్తదశోఽధ్యాయః

మేమందరము పుత్రపౌత్రాదులతో గూడి యాచార్యానుగ్రహమును నమ్మినవారమై యాశ్రియఃపతి నారాధింపుచు వచ్చుచుంటిమి. 54. క్రమముగ నిక భావికాలమందు శ్రీపుండ్రమను నొక గ్రామమందలి యర్చక కుటుంబము అచ్చటి చోలప్రభువుచే యాదరింపబడి యాతనిచే నిర్మింప బడిన వసతులుగలిగి దేశమంతటను వ్యాప్తమై భగవత్కైంకర్యమును వృద్ధి చేయు చుండగలదు. 54. ఓ బ్రాహ్మణోత్తములారా! ఈ విధమున మన యాచార్యుని యుత్పత్తి విస్తరము నెరిగించితిని. దీనినెవ్వరు శ్రద్ధా భక్తియుక్తులరై వినుటయు చదువుటయు నెద్దాని గాని యాచరింతురో వారలు పరమపదమును బొందుచుచున్నారు. 56.

ఇది యార్షమగు శ్రీ వైఖానసశాస్త్రమున మరీచిప్రోక్తమగు నానంద సంహితయందు విఖనసుని విభవావతారంబును, శ్రీసూత్ర శాస్త్ర ప్రణయనంబును శాస్త్రప్రవర్తన కథనంబును ఋషిచతుష్టయంబుచే దత్సంక్షేపంబును భగవానుని యర్చావతార ప్రకారంబును నను నంశములుగల పదునేడవ యధ్యాయము సంపూర్ణము.



శ్రియైనమః
శ్రీశ్రీనివాస పరబ్రహ్మణేనమః
శ్రీమద్విఖనస మహాగురవే నమః

శ్రీవైఖానసీయా

# మరీచిప్రోక్తా ఆనన్దసంహితా

## అథాఽష్టాదశోఽధ్యాయః

### భగవదర్చనే విఖనసో ముఖ్యాధికారిత్వమ్

అతఃపరం ప్రవక్ష్యామి వైఖానసవిభూషణం
భగవద్దేవ సంవాదం శ్రుణుధ్వం మునిసత్తమాః 1

ఇయతా గ్రంథేన విఖనసో భూమ్యామావిర్భావ ముక్త్వా తతః పరమధ్యాయత్రయేణ తస్యైవ మహిమానం స్తూత్యత ఇతి. వైఖానస విభూషణం, విఖనసోమాహాత్మ్యం, భగవద్దేవ సంవాదం సంవాదరూపమితి తద్విశేషణం, మాహాత్మ్యస్య తత్సంవాదసముత్థితత్వాత్. భగవాన్ విష్ణుర్దేవా ఉత్తరత్ర ప్రతిపాద్యమానాస్తత్ర సంవాద ప్రతియోగినః. ఉక్తం పూర్వాఽధ్యాయే విఖనసో నైమిశ ఆవిర్భావః నైమిశం హి మర్త్యప్రాప్యం తథా భగవతా చోక్తం '' భూలోకేఽవతరామ్యహ '' మిత్యూర్ధ్వలోకం నాకం విహాయ భగవతా భూమ్యా మవతార ప్రకారో దేవైర్విచికిత్సిత ఇతి భగవతాదేవానాం సమాగ మస్సంపద్యతే. 1.అత ఉచ్యతే క్వచిత్కాలాన్తర ఇతి. విష్ణుపూజాయాం విష్ణుపూజాకరణే కృతోద్యమా లబ్ధోత్కంఠాః. అనేన సృష్టిక్రియతేన తేషాం దేవానాం స్పర్ధాలుతా భూలోకలోక ఇతి. భువితు మర్త్యానాం సర్వేషాం భగవదారాధన సంపన్నేన పుణ్యేనో త్తమలోక ప్రాప్తిం పశ్యమానానాం తేషామనీర్ష్యాలుతా పరమాశ్చర్య స్థానం. అస్తి చాఽత్ర హేతుర్యదేతే

పూర్వాధ్యాయంబుచే శ్రీవిఖనోమునీంద్రుని మహీమండల మందలి యవతార విశేషమును జెప్పి యావల మూడధ్యాయములలో నామహనీయుని మహత్త్వము యుపదేశించుటకై యుపక్రమించుచున్నారు.
ఓ ముని శ్రేష్టులారా! భగవానునకును దేవతలకును జరిగినట్టి సంవాదరూపమున నిశ్చయింపబడిన విఖనసుని మహాత్మ్యమును వైఖానస విభూషణమను పేరిట నిప్పుడు చెప్పు చున్నాను. సావధాన మనస్కులరై వినుండు (అని

క్వచిత్కాలాన్తరే దేవా విష్ణుపూజాకృతోద్యమాః
విష్ణులోకం యయుస్సర్వే స్వస్వదోషాఽపనుత్తయే. 2

బ్రహ్మా త్రిశూలపాణిశ్చ పార్వతీ చ సరస్వతీ
నాగా విద్యాధరాశ్చైవ యక్షగన్ధర్వకిన్నరాః 3

సిద్ధ చంద్ర సునందాద్యా అష్టదిక్పాలకా స్సహాః
వసవో ద్వాదశాఽదిత్యా రుద్రా ఏకాదశాఽపరే 4

సప్తర్షయశ్చ బ్రహ్మాణో మనవశ్చ చతుర్దశం
నవగ్రహాశ్చాఽప్సరసశ్శచీ సగజవాహనః 5

భగవదారాధనేన సంసారాన్ముచ్యమానాః పుణ్యకృతో మర్త్యాస్స్వ రాజ్యసుఖాన్యనాకాంక్షమాణాః పరమం పదముదీక్షన్తేతత్తేషాం స్వర్లోకవాసినాం దేవానాంన తైస్స్వ రాజ్యేఽంశభాగితా నహోపరోధ ఇతి; కించాఽపరో లాభస్స్వపదస్య నిస్సపత్నాఽనుభూతిరితి. అథాఽపి విష్ణుపూజామహిమానం స్మారం స్మారముద్భ్రాంతైస్తైస్సంభూయాఽపి సమాగతమితి భావః. స్వస్వదోషాణామపనుత్తయే పరిహారాయ, దోషప్రకారో దిఙ్మాత్రముత్తరత్ర వక్ష్యతి. అథ వా దోషస్సంభావ్యమానో మదమత్సర్యాదిః, ఉత్తరత్రకోవా తేషాం మహాన్ దోష ఇతితైః పృష్టత్వాత్. కేతే దేవాస్సమాగతా ఇత్యాహ బ్రహ్మేతి. బ్రహ్మాచ శూలపాణిశ్చేత్యపి పాఠః అనేన త్రిమూర్తిసామ్యప్రతీతినిరాసో భగవతః పారమైశ్వర్య ఖ్యాపనంచ సిద్ధ్యతి. బ్రహ్మా, చతుర్ముఖస్త్రిశూలపాణిశ్శివః. "బ్రహ్మా శివశ్శ" తమఖః పరమస్స్వరాడి త్యేతేఽపి యస్య మహిమాఽర్ణవవిప్రుషస్త ఇత్యభియుక్తాః. పార్వతీ శివసతీ సరస్వతీ బ్రహ్మణస్సతీ, నాగాదయోదేవయోనివిశేషాః పృథగుక్తిస్తు వైచిత్ర్యసంవాదినీ, బ్రహ్మశివయో స్సామాన్యతో దేవతో సామానాధికరణ్యోక్తి స్తయోర్జీవకోటినివిష్టత్వ నిబంధనా "మహాఽర్ణవాఽన్త " కో మజ్జతోరణుకులాఽచలయోర్విశేషః? " 3. సిద్ధచంద్రసునందాద్యా

మరీచి మహర్షి చెప్పుచున్నారు). 1. సృష్టికార్యంబెల్ల క్రమముగ జరిగిన వెనుక కాలాంతరమున నొకప్పుడు విష్ణునారాధించుటయందు కృతోత్సాహులగు దేవతలందరును తమతమదోషముల నుండి విముక్తు లరగుటకు విష్ణులోకమునకు బోయిరి. 2. ఇచ్చటి విశేషార్థము. విఖనసుడు భగవదాజ్ఞం గైకొని నైమిశవమం దావిర్భవించెను. ఊర్ధ్వలోకమగు నాకమును విడిచి మధ్యలోకమగు మర్త్యలోకమందు భగవానుని యవతారమునకు గత మెయ్యది యను చింతాపరులైనట్టి దేవతలు

యే తే దేవాస్సమాజగ్ముర్విష్ణులోకం పరం పదం
తత్ర స్థితం మహావిష్ణుం సృష్టిస్థిత్యంత కారణం. 6
మహాలక్ష్మ్యాచ భూమ్యా చ సేవితం పద్మలోచనం
భగవన్తం నమస్కృత్య ప్రాహుస్తే విబుధోత్తమాః 7

దేవయోనివిశేషాః, సహాదిగ్గజా ఉచ్యన్తే. దిక్పాలకైస్సహేత్యపి పాఠః. తేహిపృథివీ మష్టసుదిక్షు స్థిత్వాబిభ్రతి. వసవ ఇత్యాదినా పితృవర్గాభిమానినో దేవతాస్స్మర్యన్తే. అత్ర దంపత్యోస్సాహిత్యస్యాఽవివక్షితత్వం శబ్దశక్త్యా ప్రసిద్ధ్యతీతి భగవత్పూజాకౌతుక ఆదరాతిశయశ్చ వ్యజ్యతే. ఉచ్యతేహి శ్రీమద్రామాయణే రామప్రవాసాఽనన్తరం తత్ప్రవాసఖిన్న పౌరకుటుంబినీనాం స్వభర్తృషు రామాఽనుయాత్రాప్రోత్సాహ ప్రకార ఇత్థమేవ స్త్రీణామితి బాలవృద్ధాదయ శ్చాతుర్వర్ణ్య ప్రభవా గృహ్యన్తే. 4. గజవాహనో మఘవా, దిక్పాల కేభ్యః పృథగుపాదానం తదాధి రాజ్యత్వజ్ఞాపకమితి న పౌనరుక్త్యదుష్టం. శచీ చ గజవాహనశ్శచీ సగజవాహనేత్యపి పాఠః 5. దేవేషు ప్రతిష్ఠానత ఉపన్యస్య తత్సదృశాస్సర్వే ఽన్యేఽప్యాబాలం ప్రాతిష్ఠన్నిత్యాహ యే త ఇతి. పరంపదం పరమం స్థానం క్షీరాఽర్ణవం; తస్యవైష్ణవాఽవాసత్వేన పారమ్యం బోధ్యం ''క్షీరాఽబ్ధౌచరమాయాం చ మన్మూర్తిస్సుప్రతిష్ఠితే'' తి పూర్వం భగవతైవోక్తం తథా భోజః ''క్షీరాంభోధేర్ఘతర ''మిత్యాది వికుంఠలోకత్వేతున తత్రాఽతిధేయభుజాం సంసారాత్మికా పునరావృత్తిరితి సిద్ధాన్తాదసంగతిః. తద్ధి సంసరతామగమ్యం స్థానం. ఏతేదేవా ఇత్యపి పాఠః. 5. 7. నారాయణపరం బ్రహ్మేతి తైత్తిరీయా శ్రుతిః నారాయణః పరం సర్వాతిశాయి బ్రహ్మ తచ్ఛబ్ధాభిలప్యమానం జగజ్జన్మాదికారణం వస్తు నారాయణస్తత్త్వం పరమాత్మా''తత్త్వం విలంబ మానే స్యాత్స్వరూపే పరమాత్మ''నీతి కోశః '' తత్త్వమేకో మహాయోగీ హరిర్నారాయణఃపరః

క్షీరసాగరమున కేగుట తటస్థించెను. దాననే కాలాన్తర మందనుటయు సంగత మగుచున్నది. 'విష్ణుపూజాకృతోద్యమాః' అనుటచే వారలు భూలోకమునం దీర్ష్యాళువులు గాక కేవలతత్త్వబుభుత్సచేతనే భగవానుని జేరబోయిరనుటయు తెలియుచున్నది. భూలోకమందలి మర్త్యులకు భగవదారాధనముచే సంపాదింపబడిన పుణ్యవిశేషముచే ఉత్తమలోక ప్రాప్తి గలుగుటయందు దేవతలకీర్ష్య జనింపకుండుటయు మిక్కిలి యాశ్చర్యా వహమైనదని యనదగును. ఐనను అందుకు తగిన హేతువుగూడ యుండి యున్నది. భగవదారాధనము వలన సంసారమునుండి విముక్తులగు మనుజులు స్వర్లోక సౌఖ్యముల నెంతమాత్ర మిచ్ఛయింపక పరమ పదమునే వారలభి నందించు చుండుటచే వారలతో స్వర్లోకవాసులగు

దేవాః. నారాయణపరంబ్రహ్మతత్త్వం నారాయణః పరః
నారాయణపరోజ్యోతి రాత్మా నారాయణఃపరః 8

ఇతిస్మృతిః. పర ఇతి సర్వత్ర తద్విశేషణబలాన్నపుంసకలింగశబ్దైర్నియతలింగైః ప్రాయః ప్రమీయమానం పరబ్రహ్మాత్మకం వస్తుపుమానేవేతి స్వరసతస్సిద్ధ్యతీతి వివేకః తథైవ సిద్ధాన్తిత మాచార్యపాదై "స్సత్యం జ్ఞానమనన్తం" బ్రహ్మేత్యాది శ్రుతౌ, తత్రహివిచార్యతే. సత్యజ్ఞానాఽన న్దాత్మకం వస్తు బ్రహ్మేతి పర్యాప్తార్థకం ప్రథమాన్తశబ్దసమ్మితం వాక్యముతద్వితీయ వాక్యాన్వయసాపేక్షం ద్వితీయాన్తశబ్ద సమ్మిత మపర్యాప్తార్థకం వాక్యమితి. ఔచిత్య బాధాన్యథానుపపత్త్యా ప్రబలవైదిక లౌకిక ప్రామాణ్యబలాత్. స్వీకృతో ద్వితీయః పక్షః, బ్రహ్మేతి నియత లింగం పదం నాఽత్రగుణానాముపచయాఽపచయరూపం పుంస్త్వాదినిదానం, న చాఽత్ర విశేషణ విశేష్యయో రేకలింగత్వనియమః. దృశ్యతేహి "స్త్రీరత్నంసీ" తేతి. 8. ఏతచ్ఛ్రుతిం విష్ణుపరా మేవాఽధి జగ్ముస్త ఇత్యాహైవంశ్రుత్యుక్తేతి విశ్వమూర్తిర్జగన్మయః. 8. భగవద సాధారణా భ్యామేవ విశేషణాభ్యాం తమభిష్టువన్తి గోవిందేతి, 9. అశేషం నిశ్శేషం, క్రియావిశేషణం. "యముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసార బంధనా" దితి శ్రుతిః. 10. చేతఇతి

దేవతల కంశభాక్త్వము గాని వారల కేర్పడిన స్వారాజ్య సుఖమునకు వీరలవలన ప్రతిబంధముగాని లేకుండుటయే వారియందు వీరి కసూయాభావముదయింప కుండుటకు తగిన హేతువనదగును. మీదు మిక్కిలి దేవతల స్వారాజ్య సుఖానుభవ మింకను నిస్సపత్నమగుటచే లాభప్రాప్తియు దేవతలకు గలుగుచున్నది. వారలకుగల దోష ప్రకారముత్తరత్ర చెప్పబడుచున్నది గావున నచట జూడదగును. మరియు నట్టిదోషములు త్రైగుణ్య సంపాదితమగు మదమాత్సర్యాదులనియు చెప్పదగును. ఇందుకు గమకముగ 'కోవాతేషాం మహాన్ దోషః ' అని దేవతలు భగవానుని ప్రశ్నించెడి వాక్య స్వారస్యమే అయియున్నది. చతుర్ముఖుడును త్రిశూలపాణియు శంకరుండును పార్వతియు, సరస్వతియు, నాగవిద్యాధరయక్ష గంధర్వ కిన్నరులును, సిద్ధ చంద్ర సునందాదులును, అష్టదిక్పాలకులును, అష్టదిగ్గజములును, అష్టవసువులును, ద్వాదశాదిత్యులును, ఏకాదశరుద్రులును, సప్తమహాఋషులును, నవబ్రహ్మలును, చతుర్దశమనువులును, నవగ్రహములును, అప్సరస్సులును, శచియు, ఐరావత వాహనుండగు సహస్రాక్షుండును యీ మొదలగు దేవతలందరును పరమపదమును విష్ణ్వావాసస్థానమునగు క్షీరసాగరమునకు జేరి యచ్చట

ఏవం శ్రుత్యుక్తరూపాయ నమస్తే విశ్వమూర్తయే
నమో నమస్తే గోవింద నమశ్శ్రీవత్సలాంఛన 9

యన్నామస్మరణాత్పాపమ శేషం నః ప్రణశ్యతి
కిము తద్దర్శనాత్సాక్షాత్సర్వ కల్మషహారిణః 10

అస్మాకం విమలం చేతో మేఘముక్తో రవిర్యథా
చంద్రోదయే సరిన్నాథో యథావృద్ధిం సమశ్నుతే 11

తథా హృష్టశరీరాణి పుష్యన్తి వివిధాని నః
ఏవం స్తుత్వా సమీపస్థాస్తూష్ణీమాసన్ బుధోత్తమః 12

జాత్యేకవచనం, చేతాంసీత్యర్థః. తైక్ష్ణ్యాధిక్యప్రకాశనార్థం రవిత్వోపమానం. తేన విమలం తీక్ష్ణమితి ప్రతిపదం దాతుముచితం. ''మేఘముక్త ఇవోడురాడి'' త్యేవ ప్రచురః ప్రయోగః. భగవతశ్చన్ద్ర త్వోపమానం ప్రసన్నత్వలక్షకం. దేవానాం సరిన్నాథత్వోపమానం చ నిర్మర్యాద త్వోపలక్షకం జ్ఞేయం. 11. స్తుత్వా యథాశక్తి నిర్వర్ణ్య. 12. భగవతస్సాంత్వ పూర్వక ప్రతి వచనం వక్తు ముపక్రమతే శ్రీభగవానితి. ''కచ్చిన్నిరామాయా శ్శాన్తాః కాలం క్షిపథ పుత్రకా '' ఇత్యర్థకం శ్లోకార్ధమత్రత్రుటితం స్యాత్. 13. ''దైత్త్యైశ్చ దానవైశ్చైవ రాక్షసైశ్చ ప్రపీడితా '' ఇత్యపి పాఠః దైత్యదానవరక్షాంస్య సురయోని విశేషాః. 13. లోకేష్వనాచారప్రచారో హి.

శేషపర్యంకమందు మహాలక్ష్మితోడను భూదేవితోడను కూడి యున్నట్టియు సృష్టి స్థిత్యంత కారణుడైనట్టియు భగవానుడును పద్మలోచనుం డునగు శ్రీ మహావిష్ణునింగని నమస్కరించి యావిబుధోత్తమ లిట్లని ప్రార్థింప దొడంగిరి. 'నారాయణ పరం బ్రహ్మ' యను మొదలగు శ్రుత్యుక్తమగు స్వరూప స్వభావములు కలిగినట్టి తత్త్వస్వరూపివగు నీకు నమస్కారము. (శ్రుత్యర్థము. నారాయణః - నారాయణుడు పరంబ్రహ్మ - పరంబ్రహ్మ స్వరూపమై యున్నాడు. తత్త్వం-పరమాత్మయైయున్నాడు, పరః-పరుడై యున్నాడు, నారాయణః- నారాయణుడు, పరః - పరుడును, జ్యోతిస్స్వ రూపుడును అయియున్నాడు, నారాయణః - నారాయణుడు, ఆత్మా- సర్వాంతర్యామియై యున్నాడు. పరః - దాననే సర్వశేషియై యున్నాడు.)

అథ నారాయణో దేవః ప్రత్యువాచాఽమరాంస్తతః
శ్రీ భగవాన్ 13

దైత్యదానవ రక్షోభిర్న కచ్చిత్పరిపీడితాః
కచ్చిత్ప్రవర్తతే లోకేష్వనాచారో న కుత్రచిత్ 14

దేవస్థానమపేక్ష్యాఽత్ర న కచ్చిత్తప్యతే తప ః
కిం కార్యం హేతునా కేన సంభూయేహ సమాగతాః 15

కచ్చిన్నాఽన్యోన్యకలహో భయం వాకించిదద్భుతం
ఏతత్సమస్తం విస్తార్యకో వాఽర్థో వక్తుమర్హథం 16

దేవా ఊచుః వరేణ్య యజ్ఞపురుష ప్రజాపాలనతత్పర
న రాక్షసభయం తత్రదురాచారోఽపిన క్వచిత్. 17

దేవస్థానమపేక్ష్యైవ నోగ్రం తపతి కశ్చన
అన్యోన్యకలహో వాఽపి న భయం నాఽద్భుతం తథా 18

---

నాశహేతుత్వేన దుస్సహో ఉదారచరితానామిత్యభిసంధిః. 14. దేవస్థానం దేవతాపదం తద్ధిలుభ్యన్తి పామరాస్సుఖానామాస్పదమితి. 14. తప్యతే కర్మణియక్ దేవాస్థాన మిత్యపిపాఠః తత్ర దేవా ఇతి సంబోధనం. 15. అద్భుతం దివ్యాన్తరిక్ష భౌమాదిభేదేన బహుప్రకారముక్తం విమానాఽర్చన కల్పాదౌ గ్రాహ్యం. 15. కో వాఽర్థోమయా నిర్వర్త్య ఇతిశేషః 16. వరేణ్యోఽత్యన్తం వరణీయః. ఆర్షః ప్రయోగః "సర్వదాఽభిగతస్సద్భిస్సముద్ర ఇవ పర్వభి" రితి తస్య సర్వాశ్రయత్వస్మృతేః అనేనత్వాం శరణంగతావయమభయా ఇతి వ్యజ్యతే. యజ్ఞపురుషేతి

---

గోవిందా! శ్రీవత్సచిహ్నాలాంఛితా ! నీకు పలుమారులు నమస్కారము. ఏ మహనీయుని యొక్క నామమాత్ర స్మరణము చే మాయొక్క పాపమంతయు నిశ్శేషముగ నశింపజేయబడుచున్నాడో సర్వకల్మష హరమగు నాతని సాక్షాద్దర్శనము వలన గలుగదగిన ఫలవిశేషమును గూర్చి చెప్పదగిన యంశమెద్ది గలదు. (యేదియులేదనుట). 10. మాయొక్క మనసంతయు మేఘములచే విడువబడిన సూర్యునింబోలె నిర్మలమై

భవత్పూజావిధిం జ్ఞాతుం భగవన్తం శ్రితావయం త్వత్పూజాయా 19
సురాస్సర్వే మనుష్యావాయేఽపి స్యుః పాపకారిణః
లభన్తే పరమైశ్వర్యం సద్గతిం చారిసూదన. 20
తస్మాద్భవవిముక్త్యర్థ్యం స్వస్వదోషాపనుత్తయే
సర్వైశ్వర్య ప్రదాతార మిచ్ఛన్తోఽర్చితు మాగతాః 21

సంబుద్ధిః. "యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః, యజ్ఞభృద్యజ్ఞకృత్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః యజ్ఞాంతకృద్యజ్ఞగుహ్య మిత్యుక్తలక్షణ. "యం యజ్ఞైర్మునయో జుష" స్తీతి శ్రుతిః. ప్రజాపాలనతత్పరేతి. చతుర్ముఖశరీరీ సృజతి హరశరీరీ సంహరితి చేత్యభిసంధిః. 18 ఇదం సాఽభిప్రాయకం యతోభవాన్ జాగర్తితో రాక్షసభయ మిత్యాదిత్వత్పూజాయామహత్త్వంతు శృణువామ విలక్షణ" మితి తత్ర శ్లోకార్థస్తు టితస్స్యాత్. 19. సద్గతిం మధుసూదనేత్యపి పాఠః. సతాం గతిర్హి పరముత్కృష్టమైశ్వర్య మానన్దానుభవ ఇత్యర్థః "యా గతిర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చయాగతి" రిత్యాదినా సతాంగతిః ప్రశస్యతే శ్రీమద్రామాయణే. ఐర్వర్యం సద్గతిరిత్యైహికాముష్మి కసుఖలాభో వా. 20. తస్మాద్వ్యయమిత్యపి పాఠః అపనుత్తిః పరిహారః. 20. వయం దివిష్ఠాః. భూలోక ఏవ భగవతోఽర్చావతారస్యానుగృహీతత్వాత్. భవో జనన మరణరూపస్సంసారః 21. యది భవతా భూమ్యాం విద్యమానానాం జంతూనామనేకత్వేన తదన్యేషాం పరిమితత్వేన చాన్యేష్వస్మాసూపేక్షయా బహుజనావన ఏవసంకల్పాత్. "క్షీణే పుణ్యేమర్త్యలోకం విశ" స్తీతి సర్వత్రమర్త్య లోకస్య నేమిస్థానీయత్వాదేవ వా ఈదృశమౌదాసీన్యమనుమన్యతే నవయంతావన్తం కాలము దాసితం క్షమా ఇత్యాహ ప్రమాణేనేతి. వయమపి ప్రమాణేన సంఖ్యయా భూమిం గగనం దిశశ్చ పరితో వృతావ్యాప్తాః 22. భగవన్మాహాత్మ్యమేవ స్తున్వంతి సప్తర్షయ ఇతి. సప్తేత్యుత్తరత్ర చతుష్టయేఽపి సంబధ్యతే. 23. కిమియతేత్యాహ యస్యైవేతి. 24. 25. మత్పూజయా సురాస్సర్వే శ్రూయతాం యత్ఫలం భవేత్

యొప్పుచున్నది. సరిత్పతియగు సముద్రుడు చంద్రోదయము నం దెట్లు వృద్ధినందునో యట్లే పరితృప్తింజెందిన మాశరీరములు పొంగుచున్నయవి 11. దేవతలందరిట్లని స్తోత్రముజేసి భగవాముని ప్రసాదమునకై యెదురుచూచుచుండ నాభగవానుడు దేవతల నుద్దేశించి యిట్లని యనుగ్రహించెను. (ఓ పుత్రులారా నిరామయులై శాంతముగ గాలమును ద్రోయుచుంటిరే!) దైత్యులు, దానవులు, రాక్షసులు మొదలగు క్రూరకర్ములచే మీరెట్టి పీడనుగాని బొందకుంటిరే! 13. లో కమునం దెచ్చటగాని యనాచారముపైకొని ధర్మము నశించి పోవలేదే?

త్వదర్చనే వయం శక్తాః కథం మగ్నా భవార్ణవే
ప్రమాణేన దిశో భూమిం గగనం పరితో వృతాః 22

సప్తర్షయస్సముద్రాశ్చ పర్వతాస్సరితో నదాః
వసవో ద్వాదశాఽదిత్యారుద్రా ఏకాదశాఽపరే. 23

లభన్తే పరమైశ్వర్యం మనుష్యాః పాపకారిణః ఇత్యర్ధకశ్లోకస్త్రుటితస్స్యాత్. 26. 27. దేవాయూాయాం మనుషేభ్యోఽతిశయిత జ్ఞానవంత ఇత్యర్చనవిధానజ్ఞానే భవాదృశైస్తదతిమాత్రం సదృశ మిత్యాహ భవదన్య ఇతి. "యుష్మదన్యస్తుకో వామామర్చయిష్యతి భక్తిమా" నిత్యపి

దేవతాపదవి నభిలషించి యెవ్వరిచేతగాని యుగ్రమగు తపం బాచరింపబడలేదే ! నావలన నీయెడ చేయదగిన కార్యమెద్ది? యెట్టిహేతువుచే మీరలం దరు నొకే సమయమున కలసి యిచటకు వచ్చితిరి.15. మీలో మీరల కన్యోన్యముగ కలహములుగాని భయముగాని దివ్యాన్తరిక్ష భౌమరూపములగు నద్భుతములుగాని కలిగియుండలేదే! యీ విధానంబును సవిస్తరముగ జెప్పి యిప్పుడు నాచే జేయదగిన ప్రయోజన మెద్దియో వినగోరుచున్నాను. కావున నద్దాని నెరిగింపుడు అనియెను. 16. అంత దేవతలు ను భగవానుని జూచి యజ్ఞపురుషుండును

సర్వజనాశ్రయమును ప్రజాపాలన తత్పరుండవగు నోపరమేశ్వరా! స్థితి కర్తయగు నీవు జాగరూకుడవై మమ్ముల బాలించుచుండ మాకసురయోనుల వలని భయముగాని లోకమునకు దురాచార ప్రవృత్తివలని భయముగాని యెంతమాత్రము గలుగజాలదు, ఆ భయ మెన్నడును లేదు. 17. మాదగు దేవతాస్థానము నపేక్షించి యెవ్వడుగాని యుగ్రమగు తపంబాచరించుటయు లేదు. ఐతే నీ యొక్క పూజావిధానము నెరుంగ గలందులకై భగవానుడవగు నిన్నాశ్రయించుటకై మేము వచ్చియున్నారము. 18. (ప్రపంచమునకు సృష్టిస్థితి సంయమకర్తయన పరమేశ్వరుని పూజావిధానము నెరుంగక పోవుటయే మాకు విహితకృత్యములను నెరవేర్పకుండుట యగునను కృతజ్ఞతచే మిమ్మాశ్రయింప వచ్చితిమిగాని నిర్వ్యాజ కరుణాయుతుడవగు నీపరిపాలనమునందు మాకుగల యాపద లెవ్వియు నుండజాలవనునది వారల తాత్పర్యమై యుండును.) నీ యొక్క పూజా

యస్యైవ కుక్షా విద్యన్తే భువనాని చతుర్దశ
కో వర్ణో వాऽథ దేవేశ కిం ప్రమాణం తవ ప్రభో 24

మాహాత్మ్యం విశ్వరూపాత్మన్వక్తుం తవ న శక్యతే
ఏవముక్తస్సురాన్ సర్వాన్ గోవిందః ప్రత్యువాచ హ 25

శ్రీ భగవాన్. మత్పూజయా సురాస్సర్వే
మనుష్యాః పాపకారిణః 26

నారదాదిమునీంద్రాశ్చ సద్గతిం ప్రాప్నువంతి హి
దేవాదాయస్తథా యూయం కురుత శ్రద్ధయాऽర్చనం. 27

భవదన్యేతు కే వా మామర్చయిష్యన్తి భక్తితః ?
తథాऽపి శ్రూయతాం దేవా అవధానసమన్వితైః 28

పాఠః 27. అథ భవతామూర్ధ్వలోకాశ్రయత్వేన జ్యైష్ఠ్యస్య శ్రైష్ఠ్యస్య చ సంభవేఽపి. భగవదారాధనే తాదృశం భవదభిమతం నార్హత్వాపాదనే ప్రభవతీత్యాహ తథా పీత్యాదినా. అవహిత శ్రవణే హేతుస్తూత్తరత్ర వక్ష్యమాణకథాయాంలోకోత్తరత్వం దేవానామాశ్చర్యజనకత్వం చ బోధ్యః. తథోత్తరాధ్యాయే ; దేవాః "అస్మాన్వినా విఖనసే కోవిశేష స్తవాన" ఘేతి. 28. "బ్రహ్మాస్వయం భూశ్చతురాననో వా, రుద్రస్త్రిణేత్రస్త్రిపురాన్తకోవా, ఇంద్రో మహేంద్రసురనాయకో వేత్యాది వత్ర యాణాం విధిహరశక్రాణామేవ జీవజాతసత్తావత్త్వస్మరణాదాహ బ్రహ్మేత్యాది. దోషప్రదూషి తాదోషోదుష్టాః అతఏవమమార్చనవిధౌ మామర్చితుం నార్హా నాధికారిణః 29.

మహత్త్వము విలక్షణమని తెలియుచున్నారము 19. ఓ శత్రు సంహారణా! దేవతలును, పాపకర్మలగు మనుష్యులును, నీ యర్చనముచే యైహికాముష్మిక సుఖముల నొందుచున్నారు. 20. కావున సంసార విముక్త్యర్థమును, మామా దోషముల నుండి విముక్తి కొరకును సర్వైశ్వర్య ప్రదాతవగు నీయర్చా విధానము నెరింగి కృతకృత్యుల మయ్యెదమను నాశచే వచ్చియుంటిమి. 21. భవసాగరమందు మజ్జనోన్మ జ్జనంబుల నందు చుండు మేమెట్లు నిన్నర్చించ గలము. (నీవు మాకు సులభు డవుగ లేవనుట) భూలోకమందలి మర్త్యజనంబులవోలె మేమును దిక్కులును భూమిని

బ్రహ్మేశానసురేంద్రాశ్చ వసిష్ఠాద్యా మహర్షయః
మమాఽర్చనవిధౌ నార్హాస్స్వ స్వదోషప్రదూషితాః 29

దేవా ఊచుః, స్వతేజోవ్యాప్తదిక్చక్ర! మహాత్మన్ మధుసూదన
కోవాతేషాం మహాన్ దోషస్తన్నోబ్రూహి సునిశ్చితం 30

స్వతేజో వ్యాప్తే త్యాది సంబుద్ధిత్రయం కోవేతి. విష్ణులోకం యయుస్సర్వే స్వస్వదోషా పనుత్తయే ఇతి పూర్వోదితేన స్పష్టం జ్ఞాయతే "జానత ఏవ దేవా స్వయం దోషదుష్టా భగవదారాధనేఽ వధికారిణ ఇతి చ. తథోత్తరత్రోక్తం చ " తస్మాద్భవవిముక్త్యర్థం స్వస్వ దోషాపనుత్తయ" ఇతి స్వయమేవ భగవన్తం ప్రతి. తతస్తైరుక్తమేవోరీకృత్య ప్రత్యభిహితం భగవతా " మమాఽర్చన విధౌ నార్హాస్స్వస్వ దోషప్రదూషితా" ఇతితత్క మితి పునఃపృచ్ఛ్యతే" కోవాతేషాం మహాన్దోష ఇతి చేదిదంభావ్యం యాదృశో దోష ఉద్దిష్టస్తైస్స భగవతర్చావిధావపి ప్రతిబంధక ఇతి నాఽమంస తతీ ఇతి. అథవా సముదిష్టో దోష స్తత్తదధికారోపసంహితోన స్వకార్యాయ ప్రభవతీత్యమంసత వేతి. తచ్చమహాన్ దోష "స్సునిశ్చిత" మితి పదాభ్యాంకో వేత్యారంభసామర్థ్యాద్వ్యాస్పష్టమవగమ్యత ఇతి న పౌనరుక్త్యం. 30. అంగాధిక్యమధికాంగవత్త్వం ఆర్షః ప్రయోగః 32. "వసిష్ఠాదితవస్వినా" మిత్యనన్తరం

ఆకసమును, ఆవరించి యసంఖ్యాకుల మై యున్నాము గాని ఉపేక్ష చేయుటకు మే మల్పసంఖ్యాకులము కూడ కాకున్నాము. 22. సప్తర్షులు, సముద్రములు, పర్వతములు, సరిత్తులు, నదములు, మొదలగునవియు, వసువులు, ద్వాదశాదిత్యులు, యేకాదశరుద్రులు యీ మొదలగు వారలును వేయేల! పదునాలుగు భువనంబులును యేమహనీయుని యొక్క కుక్షి యందు యిమిడియున్నవో అట్టి నీ యొక్క స్వరూపస్వభావంబు లెయ్యవి? ఓ విశ్వరూపాత్మకా! అట్టి నీ మహాత్మ్యమును వర్ణింప నెవ్వరికిని శక్యము గాదు. 24. ఇట్లు దేవతల చే ప్రార్థింపబడిన గోవిందుడు దయా తరంగితాంతరంగుడై వారలను గూర్చి ఇట్లని ప్రత్యుత్తర మొసంగెను. (ఓ దేవతలారా! నా పూజయొక్క మహాత్మ్య మెట్టిదో ఆవిధము నెరింగించెద వినుండు) పాపకర్ములగు మనుష్యులు సైతము దీనివలన బరమైశ్వర్యమును

శ్రీ భగవాన్. విధేశ్చతుర్ముఖత్వాచ్చ త్ర్యంబకత్వాచ్చ శూలినః
అంగాధిక్యాద్విరూపత్వాద్దోషఉక్త స్తదాశ్రితః 31
ఇంద్రస్సహస్ర నేత్రత్వాద్దోషదుష్టస్తథైవ సః
తదన్యేషాం యోనిజత్వాద్వసిష్ఠాది తపస్వినాం. 32
x x x x x
తస్మాదనర్హాస్తే సర్వే మమ పూజావిధౌ సురాః 33
భవద్భ్యః పరితుష్యామి భక్తిమాత్రేణ కేవలం 34
వైఖానసం వినా నాऽన్యస్సాక్షాదర్చితు మర్హతి
వైఖానసే మమ మనస్సర్వదా రమతే యతః 35

"దోషోపయోదితోజ్ఞేయో భవద్భిర్యశ్శుభావిత" ఇత్యర్ధకం శ్లోకార్థం త్రుటితంస్యాత్. 32 సురా ఇతి సంబోధనం. 33. యదా తేऽనధికారిణోऽర్చనే సంవృత్తాస్తదా తేషాముత్తరలో కా గతిరిత్యత ఆహ భవద్భ్యఇతి. 34. కేవలమిత్యనన్తరం "మదర్చా నార్హముత్త[illegible] విఖనా బ్రహ్మవిత్తమ " ఇత్యర్థకం శ్లోకార్థం త్రుటితం స్యాత్. 34. ప్రసంగాదధికారి[illegible] వ్యవచ్ఛినత్తి వైఖానసమితి. వైఖానసో విఖనాః. " తస్మాత్తేనైవముని"
నేత్యుత్తరత్రోపసంహారాత్. సాక్షాత్స్వాతంత్ర్యేణ. 34. తత్ర హేతుమాహ వైఖానసఇతి. 35. వైఖానసం వినాన్య ఇతి వైఖానసేతరేషామనర్హ

పొందుచున్నారు. 26. ఇట్లే నారదాది మునీంద్రులును సద్గతిని బొందుచున్నారు. (నారదాదులు నాయర్చావిధానమునుతత్త్వము నెరింగి యున్నారనుట) ఓ దేవతలారా! మీరును శ్రద్ధాళువులై నాయర్చనము జేయగలవారు. నాకు మాత్రమెవ్వరుగలరు? (ఈ చెప్పబోవు రహస్యమును మీరెరింగిన యెడల మనుష్యులకంటె యెక్కుడు జ్ఞానసంపన్నులరగు మీరలు కృతకృత్యులగుట కెక్కుడు నవకాశము గలదనుట) ఐనను మీకీయెడ జెప్పదగినదియు నొక్కవిశేషంబుగల దద్దాని నెరుకపరచెద సావధాన చిత్తులరైవినుండు, 28. బ్రహ్మ, రుద్రుడు, సహస్రాక్షుడు, వసిష్ఠాది మహర్షులును (ఇట్లే యొక్కొక్కరును) తమతమ దోషములచే దూషితులగుటం జేసి నాయర్చనము సేయుటయం దర్హులు కాజాలరు

దేవా ఊచుః. త్వదర్చనపరానస్మాన్ హిత్వావైఖానసే మతిః
కథం కృతా త్వయా బ్రహ్మం స్తద్వదస్వ కృపానిధే? 36

శ్రీ భగవాన్ శ్రుణుధ్వం విబుధాస్సర్వే బ్రహ్మణః పూర్వమేవహి
జ్ఞాపితం సంగ్రహేణైవం తథాపి ప్రవదామ్యహం 37

ప్రజాపతిస్ససర్జాఽదావాకాశం సలిలం తథా
అగ్నిం వాయుం మహీం చైవ మనుష్యాదీన్ క్రమాదసౌ 38

త్వోక్త్యాత్రత్ర స్వేషాంతదర్చన పరత్వాఽవిశేషా త్తత్సదృశానాత్మనో మన్యమానా దేవాశ్శంకన్తేత్వదితి. త్వదర్చనపరాన్ త్వామర్చితుమాసక్తాం స్తదర్థమేవేహాగతానితి చ భావః. కృపానిధే ఇతి సాఽభిప్రాయం విశేషణం. 35. కథమితిత్వదర్చనపరేష్వియత్సు దేవయోనిష్వేకస్యైవాఽస్యాదృశ గౌరవసమర్పణే మహదాశ్చర్యం ద్యోత్యతే. 36. విబుధా ఇతి సంబోధనం భవత్సుమధ్యే సర్వమిదం మయోక్తముచ్యమానం చ బ్రహ్మణే పూర్వమేవ విస్తరాత్ జ్ఞాపితముపదిష్టం. తథాపి సంగ్రహేణాద్యేదం ప్రవదామి. సంగ్రహేణైవేత్యపి పాఠః. 37. ఆకాశసలిలాదయో వ్యష్టిసృష్టివిషయాః. 38. 40. వైఖానసో మదురసాజాతో మదాజ్ఞావశగః. అతః ప్రియశ్చ భవతి.

అనెను. 29. అంతదేవతలును, స్వతేజోవిశేషముచే వ్యాపించబడిన దిగ్వ లయము గలట్టియు మహిమాన్వితుడగు నట్టియు నో మధుసూదనా! తాము చెప్పిన చొప్పున బ్రహ్మేశానాదులకు గల దోషమే ప్రకారంబైనదో మాకు నిశ్చితమగునట్లుపదేశింప గోరుచున్నాము అని పలికిరి. 30.ఈ యంశమును పృచ్ఛింపబడిన భగవానుడును దేవతల నుద్దేశించి యిట్లనియె. బ్రహ్మ నాలుగు ముఖముల తోడను యీశ్వరుడు త్రినేత్రములతోడను గూడియుండుటచే నొక్క డధికాంగములు గలిగియు. రెండవవాడు వైరూప్యముగలిగియు నుండుటయే వారలకు భయులకును గలిగిన దోషము సహస్రాక్షుడగు దేవేంద్రుడును అట్టి దోషముచేతనే కూడియున్నాడు. ఇట్లే వసిష్ఠాదులగు మహర్షులును యోని జన్మలగుటచే దోషదుష్టులై యున్నారు. (ఈవిధమున మీచే యుద్భావింపబడిన దోషములు నెరింగించితిని)

32. కావున నన్నుపూజించుట యందు పైవారలం దరును అనధికారులై యున్నారు. మీరలు భక్తియాత్ర పరాయణులై యున్నంత నేను ప్రసన్నుడనగుచున్నాను. (నాయర్చనము చేయుట కొరకే బ్రహ్మ

తదాతు లోకరక్షార్థం విఖనా మదురస్థలే
మయా సృష్టో మదర్చార్థం తేన తేऽర్చాపయన్తుమాం. 39

వైఖానసం వినాऽన్యేయే దేవతా ఋషయ స్తథా
మనుష్యా వాऽర్చనం కర్తుం న శక్తా మమ దేవతాః 40

ఉరసా మమ జాతత్వాన్మమా జ్ఞావశగః ప్రియః
వైఖానసో మమ సుతస్తస్మాద్వైఖానసోవరః 41

వింశల్లక్షా ద్రుమాదీనామేకలక్షః పయోభువాం
రుద్రసంఖ్యాః కృమీణాం చ దశలక్షాశ్చ పక్షిణాం 42

సప్తకోటిః పశూనాం చ తతః పంచజనాస్స్మృతాః
x x x x x 43

తస్మాత్తదురసా జాతత్వాత్తత్పూత్ర విధ్యనుష్ఠానా త్తచ్ఛిష్యసంతతి గతత్వాచ్చ వైఖానసోవరః. తత్ర వైఖానస ఇతి జాత్యేకవచనం. యద్వా వైఖానసో విఖనా వరశ్శ్రేష్ఠః. విఖనా హి స్వపుత్రాన్ భృగ్వాదీనసృజదితి పూర్వమేవ ప్రతిపాదితం చేహానుసంధేహం. 41. స్థావర జంగమ స్వరూపే ప్రాణిని క్రమ వృద్ధ్యా పుణ్యాజన్మలాభాదికమాహ వింశదితి, పయోభువాం జలజాతానాం తతః కృమయః పక్షిణః పశవో మనుష్యాశ్చ. పంచజనానరాః, న తేషాం సంఖ్యా నిర్వ్యాఢా. సంఖ్యాతోపి లక్షణా. పంచజనాస్స్మృతా ఇత్యనన్తరం "బ్రాహ్మణ క్షత్రియోరవ్యజఘన్యజనుషాం క్రమాత్, స్వస్వకర్మానురూపేణ ప్రాప్య జన్మయధోచిత " మిత్యర్థక శ్లోకాస్త్రుటిస్స్యాత్. 43. 44. మదంశజ ఇత్యనన్తరం "మదర్చ నార్థముత్పన్నో విఖనా బ్రహ్మవిత్తమ " ఇత్యర్థకం శ్లోకార్ధంత్రుటితంస్యాత్. 45.వైఖానసం విఖనస్సంబంధి శ్రైష్ఠ్యం శ్రుతిస్మృతిపురాణేభ్యోమితం

విత్తముడగు విఖనసుడు సృజియింపబడెను.) కావున వైఖానసేతరుడు (వైఖానసుని కంటె యన్యుడు) యెవ్వడుగాని స్వయముగ నా యారాధనమును జేయ నధికారి కాజాలడు. వైఖానసునియందే నామనం బెల్ల కాలంబులందును లగ్నమై యున్నది. 35. ఈ ప్రకారంబగు భగవ ద్వాక్యంబును వినిన దేవతలును, ఓ పరబ్రహ్మస్వరూపియగు పరమాత్మా నీ యర్చనమందు తత్పరులమైయున్న మమ్ము బోటుల నందరను విడచి వైఖానసుని యందు నీమనంబెట్లు లగ్నమైనదో సహేతుకముగ

బ్రాహ్మంయోనిశతం ప్రాప్య బహుజన్మతపఃఫలాత్
వైఖానసత్వం ప్రాప్తో యస్స చ శ్రేష్ఠో మదంశజః 44
... ... ...
శ్రుతిస్మృతిపురాణేభ్య శ్శ్రేష్ఠ్యం వైఖానసం మితం 45

ప్రమితం భవతి. 45. తస్మాచ్ఛ్రేష్ఠత్వాద్దేతోర్వైఖానసై ర్విఖనసస్సూత్రానుయాయిభిస్తేన మునినా విఖఙోనామ్నామాం సర్వేప్యర్చాపయన్తు. 46. అత్ర భగవదర్చనాసముత్సుకానాం దేవానాం భగవదా శ్రయణం భగవతా స్వార్చనే ముఖ్యాధికారినిరూపణం భక్తిమార్గస్యోత్తరత్వమిత్యంశాః ప్రతి పాదితాః. ఆహత్యశ్లోకానాం సార్థ షట్చత్వారింశత్, త్రుటితాశ్చత్వారశ్లోకా అష్టార్ధశ్లోకావా గ్రధితాఃన కుండలీకృతో భాగః.

నాప్రకారంబును ఓ కృపానిధీ? మా కెరింగింపుము. అనిన భగవానుడును, ఓ దేవతలారా! మీ యీ సంశయము లన్నియు నింతకు పూర్వమే చతుర్ముఖునికి సవిస్తరముగ జెప్పబడియున్నవి. ఐనను ఆయంశము నిప్పుడు సంక్షేపించి మరియొక మారు మీకై చెప్పుచున్నాను. 37. చతుర్ముఖుడా కాశమును, సలిలమును, అగ్నిని, వాయువును, పృథ్విని ఆవల క్రమముగ నన్నాదులను మనుష్యాదులను సృజియించెను. 38. ఇట్టి సృష్టి యవిచ్ఛిన్నముగ బ్రవర్తించుటకై యటువెనుక నాహృదయమందు విశేష ఖననముచే నాయర్చ నార్థమై విఖనసఋుషి నాచేతనే సృజి యింపబడెను. కావున నట్టియా విఖనసుని చేతనే మీరలు నాయర్చా విధానమును జేయించికొనవలయును. 39. వైఖానసుడు దక్క యే మనుష్యులుగాని ఋషులుగాని, దేవతలుగాని నాయర్చనము జేయ నధికారులు కారు. 40. నా మానసమందుండి యుద్భవము నందుటం జేసియు నాయాజ్ఞావశవర్తియగుటంజేసియు నాకు ప్రియుడై వైఖానసుడు నాకుపుత్ర శబ్దమునకు ముఖ్య వ్యవహార పాత్రమై యున్నాడు. (పుత్రశబ్దము సర్వసామాన్యముగ భగవత్ప్రతియోగిక మగు సమస్తచేతనాచేతనమునకు వాచకమైయున్నను పుత్రశబ్ద ప్రవృత్తియోగ్యతకు ప్రధానపాత్రము విఖనసుడేనని తాత్పర్యము.) అట్లే నామానసపుత్రుడైన విఖనసుని యందువలె విఖనస మానసపుత్రులగు వైఖానసులగు భృగ్వాదులును

తస్మాత్తైస్తేనమునినా సర్వేప్రర్వ్యా పయన్తుమాం
ఏవముక్త్వా హరిస్తూక్ష్ణీ మాసీ ద్భక్తప్రియో విభుః

తత్సూత్ర శాస్త్రానుష్ఠాన పరులగు నశేష వైఖానసులును అట్లే సర్వవిప్రోత్తములును నాకత్యంత ప్రియులును అగుచున్నారు. (ఇచ్చట వైఖానసః అనునది యీయర్థమందు జాత్యేకవచనముగ భావించదగును) 41. స్థావరజంగమాత్మక మగు సమస్తబ్రహ్మాండాన్తర్గత ప్రాణి కోటియందును కర్మానుగుణ్యముగ ప్రతిప్రాణికిని గతాగతములు గలుగుచుండునని సిద్ధపరచికొని యాప్రకారంబును చెప్పుచున్నారు. వృక్షాదులు యిరువది లక్షలు (తృణాగుల్మ లతాదు లిందు జేరును) పయోజన్యంబులు లక్ష మాత్రము. (మత్స్యజాతియు జల చరంబులన్నియు నిందుజేరును) కృములు (కీటకములు) పదునొకండు లక్షలు. ఇందు క్షుద్రజంతువు లన్నియు చేరును. క్షుద్రజంతు లక్షణంబును "ఆనకులాత్ క్షుద్ర జంతవః" చిన్ని జంతువులు మొదలుకొని ముంగిస వరకు గల జంతువులన్నియు క్షుద్ర జంతువులని పాతంజల మహాభాష్యమందు జెప్పబడి యున్నది. పక్షులు పదిలక్షలు, (యిందు వాయుతత్త్వ ప్రకృతికములగు జంతువు లన్నియు చేరును.) ఏడుకోట్లు పశువులు, (ఇందు చతుష్పాద జంతువులన్నియు చేరును.) ఇట్లు ప్రాణిసంఖ్య వివరింపబడినది. ఈ ప్రాణులన్నిటిని దాటి యావల మనుష్య జన్మంబు సంభవించును. 34. (మనుష్యజన్మంబునందును బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులను చాతుర్వర్ణ్య విభాగంబు గలదు.) ఇట్లు చతుర్వర్ణములందును ఉత్తమమగు బ్రాహ్మణ జన్మమందు యెడతెగక నూరు జన్మంబులనెత్తి యీవిధమగు బహుజన్మార్జిత తపఃఫలంబుచే నెవ్వడు వైఖానసత్వమును అనగా వైఖానస జన్మమును బొందునో నాయంశ సంజాతుడగు నాతడు సర్వప్రాణి కోటియందు నుత్తము డగుచున్నాడు. 44. (నాయర్చనము సేయునిమిత్తమై బ్రహ్మ విత్తముడగు విఖనసుడు సృజియింపబడెను.) ఈ ప్రకారంబగు విఖనసుని మహత్త్వము శ్రుతిస్మృతి పురాణములవలన స్పష్టముగ నుద్ఘోషింప బడుచున్నది. 45. కావున నామహర్షిని పురస్కరించుకొని మీరందరును నన్నర్చింపవలయును. ఇయ్యదియే పరమ రహస్యము.

ఇత్యార్షే శ్రీవైఖానసే మరీచిప్రోక్తాయామానన్ద
సంహితాయాం (వైఖానస విభూషణం నామ) అష్టాదశోఽధ్యాయః

విఖనసుని వంటి యధికారము తత్సూత్రానుష్ఠాతలకు నేను గ్రహించి యుండుటం జేసి వైఖానసులును నట్టి యధికారులను నంశము వేరుగ నిచ్చుట మరియొక మారుదహరింపనక్కర లేదు. ఈవిధంబుగజెప్పి భక్త ప్రియుండును ప్రభుండునగు భగవానుడూరకుండెను. 46.

ఇది శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రమున మరీచి ప్రోక్తమగు నానందసంహిత యందు భగవదర్చనా సముత్సుకులగు దేవతలు భగవానుని సందర్శింప బోవుటయు భగవానుని చేత నీయర్చనమునందు వైఖానసులే ముఖ్యాధికారులని నిరూపించుటయు భక్తియోగమందలి యతిశయమును గల పదునెనిమిదవ యధ్యాయము సంపూర్ణమ్.



శ్రియైనమః
శ్రీశ్రీనివాస పరబ్రహ్మణేనమః
శ్రీమద్విఖనస మహాగురవే నమః

శ్రీవైఖానసీయా
# మరీచిప్రోక్తా ఆనన్దసంహితా

## అథైకోనవింశోఽధ్యాయః
## ( వైఖానసమాహాత్మ్యమ్)

అతః పరం ప్రవక్ష్యామి మాహాత్మ్యం తస్యవై మునేః
శ్రుత్యాదిషు యథా సిద్ధం శృణుధ్వం సువ్రతాదయః 1

అస్య పూర్వాధ్యాయ శేషత్వేఽప్యుచితే తత్ర యథా విస్తృతో భగవద్దేవసంవాద ఉపన్యస్తోన తథాఽత్రాస్మన్నితి విషయ వ్యవస్థాం ప్రదర్శయితు మతథాకరణం వైభాజిత్రమనుసన్ధేయం యదుక్తం పూర్వాధ్యాయే శ్రుతిస్మృతిపురాణేభ్య ఇతి, తత్రత్యంగ్రంథముపన్యస్తుకామ ఉపక్రమతేఽతః పరమితి. తస్యమునేర్వైఖానసస్యైవ మహాత్మ్యం ప్రవక్ష్యామి. 1. "ఏవముక్త్వా విభుస్తూష్ణీ మాసీచ్చక్రప్రియోహరి " రితి పూర్వత్ర భగవద్దేవ సంవాద ప్రకరణే భగవదుత్తరేణ గ్రంథస్సమాపిత ఇతి తతః పరం గ్రంథసందర్భం స్మారయత్యేవమితి. ఏవం బ్రువన్తం భగవన్తం త్రిదశా అపృచ్ఛన్. బ్రాహ్మణాశ్శాస్త్ర చక్షుషశ్శ్రుతిస్మృతి పురాణేభ్యః ప్రమాణాని జిజ్ఞాసన్త్యథ వా భగవద్వాక్యాదేవ " శ్రుతిస్మృతి పురాణేభ్యశ్శ్రేష్ఠ్యం వైఖానసం మిత " మిత్యస్మాత్తత్ప్రవృత్తౌ ప్రరోచితా ఇతి తాదర్థ్యేన తేషాం సంబోధన ముచితమితి కృత్వాసువ్రతాదీనామాభిముఖ్యం సంపాదయతి శ్రుతిస్స్మృతీతి, ప్రమాణం వైఖానస ఋషేర్మా హాత్మ్యే గ్రంథ ప్రమాణం, తథా చ శ్రుతీత్యాదివాక్యం సువ్రతాదయ ఇత్యస్య విశేషణం సంబోధనం జ్ఞేయం.

ఈ యధ్యాయమును పూర్వాధ్యాయముయొక్క శేషముగనే యెంచదగి యుండినను అందు భగవానునకును దేవతలకును జరిగిన సంవాదమెట్లు విస్తరించి చెప్పబడి యుండెనో యంతటి విస్తరముగ నాయంశ మిందు జర్చింపబడిగాని బ్రాధాన్యము జెందియుండి గాని యుండక ప్రవక్తయగు మరీచి మహామునిచే సంగ్రహింపబడిన శ్రుతి, స్మృతి పురాణాదులనుండి ప్రమాణజాల ముపదేశింపబడుటంజేసి ప్రత్యేకమగు నధ్యాయముగ నియ్యాది

ఏవం బ్రువన్తం లక్ష్మీశమబ్రువం స్త్రిదశా వచః
శ్రుతి స్మృతి పురాణేషు ప్రమాణం జ్ఞాతుముద్యతాః ? 2

2. శ్రుతిప్రమాణోపన్యాసాయావతారయతి దేవా ఊచురితి. శ్రుతిర్హి భగవదాజ్ఞా, దేవానాం పూర్వాధ్యాయే సన్నిధాపితానామభ్యర్థనాయా ముద్భావితా యా భాగవతీ వాక్సా హి ప్రకరణస్పర్శినీ సాధియసీ త్యగ్రే తామేవ శ్రుతిముపన్యస్యతీతి సుతరాముపపద్యతేఽస్య సంగతిః, శ్రుతిస్మృతీత్యాదివాక్యస్య త్రిదశాఇత్యనేన సామానాధికరణ్యాం సంపాద్య తాత్పర్యవర్ణనే దేవా ఊచురిత్యస్యాఽసంగతి స్స్పష్టైవః. " చిరకాలంతపః కృత్వేత్యపి పాఠః. అత్ర కృత్వేత్యుభయాన్వయి పతశ్చాంద్రాయణాదీ" తిభక్తేర్జ్ఞానస్య చోపలక్షణం. భవదాజ్ఞానువర్తిన ఇత్యస్యైవ సంగ్రహః, " వేదాక్షరాణి యావన్తి పఠితాని ద్విజాతిభిః. తావన్తిహరినామాని కీర్తితాని న సంశయ ఇత్యాది ప్రమాణైః క్రియా యోగస్య భగవదాజ్ఞాత్వా విషేషోత్తత్రప్రవృత్తి మతాం భగవదాజ్ఞానువర్తిత్వస్య సర్వసిద్ధత్వాత్.

పూర్వాధ్యాయమునుండి విభజింపబడదగునను విషయవ్యవస్థయందు గ్రంథ కారునకు గల యాదరాతిశయము సూచింప బడుచున్నది. పూర్వాధ్యాయ మందు శ్రుతిస్మృతి పురాణములయందు విఖనసుని మాహాత్మ్యము ప్రసిద్ధమై యున్నదని భగవానునిచే జెప్పబడుటచే నయ్యేప్రమాణములను శిష్యుల కుపదేశించుట మహర్షికి ప్రమేయము గలుగుట వలన పూర్వోత్త రాధ్యా యములకు సంగతి సిద్ధంబగుచున్నయది. ఓ! సువ్రతాదులగు మహర్షులారా! ఆవల శ్రుతిస్మృతి పురాణములయందుపన్యసింపబడినట్టి యావిఖనో ముని యొక్క మాహాత్మ్యమును తెలియజెప్పుచున్నాను. శ్రుతిస్మృతి పురాణముల నుండి యాయంశమును విననిచ్ఛయించుచున్న యో మహనీయులారా! (శాస్త్రచక్షువులగు మీరల కట్టి యభిప్రాయము దయించుట తగియున్నది. అదియును గాక మీకు నట్టి శాస్త్రవచనములనే యుపన్యసించుటయు యవసరముగావున మీరలను నేనిట్లాదరించు చున్నానని భావము.) పూర్వాధ్యాయమందు భగవానుడు విఖనోముని యొక్క సంభవంబును మాహాత్మ్యంబును విశదపరచిన విధంబును తెలియబలికి యుంటిని గదా! అట్లు భగవానుని యుత్తరంబును వినిన దేవతలాశ్చర్య మగ్నమానసులై శ్రీమన్నారాయణుని గూర్చి యిట్లని పృచ్ఛించిరి. 2. దేవతలిట్లని పలికిరి. శ్రుతియనిన భగవదాజ్ఞయే గావున సామాన్యముగ గహనార్థములైన పఠ్యమానములగు శ్రుతులకంటె సాక్షాత్తు

దేవా ఊచుః. చిరం తప్త్వా తపః కృత్వా చాంద్రాయణ మహావ్రతం
శరీరం కృశముద్భావ్య భవదాజ్ఞాను వర్తినః,

అనువర్తిన ఇతి ద్వితీయా బహువచనాన్తం పదమస్మానిత్యుత్తర శ్లోకస్థపదేవాऽన్వేతి, తప ఆదీనాంక్లేశసాధ్యత్వం తదా స్పృదత్వం చ సిద్ధం. యథా మదీయే, మంగలాశాసనస్త వమాలికాయాం రామస్తవే "తపః క్షామాం మంస్థా హతహృదయమాత్వం తనుమిమాం సమేష్టాऽస్యహ్నాయ ప్రియపరిజనం ధామనగరే, నకిం ముక్తారూపా కనకమయసూత్రాయ లసతే విదీర్ణా కామాऽన్తఃపురఘననితంబాస్తనతట" ఇతి. ముక్తారూపేతి ముక్తాశబ్దాత్ప్ర శంసాయాం రూపప్, విశేషవిజ్ఞాతా చ. 2, విహాయాऽస్మాన్విఖనస ఇత్యర్థః. "వైఖానసో విఖనసో విఖనాశ్చ విరించన" ఇతి కోశాదజన్తం విఖనస పదం, "తవకో విశేషో హేతుస్త స్మిన్నస్మద పేక్షయాऽऽదరాऽతిశయ" ఇతి ప్రశ్నః. అథ వా తస్మిన్ విఖనసే కో విశేషో గుణః పాత్రతా నామయయా త్వమాకృష్యసే తత్పక్షపాత ప్రభూత ప్రగ్రహైరితి ప్రశ్నాऽశయః, అనఘ

గనే భగవానుని వాక్కునుండి ప్రత్యేకముగ నదియే కార్యము నుద్దేశించి వెలువడిన ప్రశస్తియనునది ప్రశంశనీయంబనియు నభ్యర్థితంబనియు దలచి యావాక్కు నుదహరించు టకై యవతారికగ దేవతల యభ్యర్థన ముపక్రమింప బడినదని తెలియదగినది.' శ్రుతిస్మృతి పురాణేషు ప్రమాణం జ్ఞాతుముద్యతాః అనునది దేవతలకు విశేషంబై 'భగవానునాచ' యని యారంభించి యధ్యాయసమాప్తి వరకు నుపన్యింపబడిన పలు విధప్రమాణములు భగవద్వాక్యమే అయిన యెడల నీ యర్థము బాధింపబడుటయే గాక ప్రకరణమున కనౌచిత్యము దగులుచున్నది. కావున నౌచిత్య సంపాదనమునకై పై యర్థము గ్రహింప ధగును. నిష్కల్మష హృదయుండవగునో దేవా! అనేక కాలంబు తపంబును చాంద్రాయణాది మహావ్రతంబులను యిట్లెన్నియో శ్రౌతస్మార్త ధర్మంబులను శ్రద్ధతో నాచరించి నీ ప్రసాదమునకయి యెదురు చూచు చున్నట్టి నీకృపను మాపై బరుపగలవను దృఢ విశ్వాసముతో కాచి యుంటిమి, (నీయాజ్ఞా రూపములగు శ్రుతిస్మృతులయందుక్తమైన ధర్మము లను కాయక్లేశాదుల బాటింపక యొనర్చుచు దాన నీ యను గ్రహమును సంపాదింప బ్రయత్నించు చున్నామనుట.) ఇట్లు నిరంతరము నీ యందాధారపడి నీయాజ్ఞాప్రజ్ఞలలో మెలగుచున్న దేవతలము (ఉత్తమ లోక వాసులమనుట)

అస్మాన్ వినా విఖనసే కో విశేషస్తవానఘ. 3

× + × × ×

శ్రుతి స్మృతి పురాణేషు కిం ప్రామాణ్యం వద ప్రభో 4

ఇతి. అనఘస్త్వమేతాదృశం పక్షపాతం వోఢుం నార్హసీత్యభిసంధిం సంచయతి. 3. అత్రాఽనఘ ఇత్యనన్తరం " త్వయి తిష్ఠత వేదానాం ప్రవక్తరిపురస్స్వయ " మిత్యర్థకం శ్లోకార్థం త్రుటితం స్యాత్. 4. ఉక్తం త్వయా " శ్రుతిస్మృతీత్యాది యత్తదస్మాకం పరముపాలంభ ఇత్యవగచ్ఛామః, కిమస్మాకంత్వయి " ప్రవక్తాఛందసాం సాక్షా " దితి ప్రతిపాదిత వైభవే పురతస్తిష్ఠతి సాక్షాచ్చ తత్త్వం ప్రతిపాదయతి తస్యావాచః పరం గ్రంధస్థాయా గహనార్థాయా శ్శృత్యాదేః కథం ప్రామాణ్యం తత్త్వోద్బోధాయసుగమమితి భగవదుక్తామాజ్ఞాం పూర్వాధ్యాయేరితామేవ ప్రశంసన్తి శ్రుతీతి. నాఽస్మాకం గహనాయాం వేదరశౌతదుపబృంహణే ప్రమాణాన్తరే వాతావాన్ విశ్వాసో యావాంస్త్వద్వాచి సాక్షాదస్మాసు ప్రకరణపరికర ఉక్తాయామితి, శ్రుత్యాదీనాం వక్తాఽత ఏవతద్రహస్యవేదీ హి స్వయమేవ త్వమసంశయ మేవమాత్థకిం త్వదభ్యనుజ్ఞాయాః శ్రుతిసారరూపాయాః పరం. శ్రుతిస్మృత్యాదిభిర్బాధసహైరితి చ భావః. అత ఉక్తమిదం భవత్యస్మాసు శ్రుతిస్మృత్యాదిషు న భగవత్సన్నిధావర్ద నిర్ణయాధికార " స్త్వమేక స్సంశయస్యాస్యభే " త్తేతి వద్వయం పరితృప్తాస్తథా పి భవదుపన్యాససారం సంక్షిప్య తదుత్తం సర్వాతిశాయి ప్రమాణమేక ముపన్యస్తుమభ్యర్థయస ఇత్యత్ర గూఢోఽభిసంధిః. 4. భగవాన్ సమాధత్త ఆత్మావా ఇతి. విశ్వకుటుంబినో విష్ణోర్మమైవాఽత్మా పుత్రనామా, యోఽయం విశేషఖననాత్తత్త్వార్థపరిచిన్తనా దాసీజ్జాతస్యోఽ న్వర్థనామా విఖనా ఉచ్యతే, అన్వర్థ నామత్వఖ్యాపనాయ హేతూపన్యాసః, మమేత్యర్థాల్లభ్యం విశేష్యం. కుండలీకృతం శ్లోకార్థం కుత్ర చిన్న లభ్యతే. 5. యదా విఖనా మునిర్మమైవాత్మా జాత స్సంభూతస్తథైవ వ్యవహృతస్తదా తత్సూత్రానుయాయిత్వేన తత్పుత్రా స్తచ్ఛిష్యాశ్చ జనాస్తత్తుల్యత్వేన తత్త్వబుద్ధ్యా గృహ్యన్తే మయేత్యాహ వైఖానసా ఇతి.

వైఖానసా, విఖనస్సూత్రోక్తాఽష్ట దశ శారీర సంస్కార శాలినః, ఔచిత్యాత్. తేషామేవ భగవత్ప్రియితమత్వేన సర్వాఽతిశాయిత్వో వపత్తౌ భగవద్భి శ్శ్రీనివాస మఖీంద్రైర్దశవిధానాం హేతూనాముపన్యాసస్త త్రాఽనుసంధేయః తే వైఖానసా ఔరసాః ఔరసేనమమైవ మానసాజ్జాతేన విఖనసా తుల్యాః. విఖనస ఔరసత్వం " చాఽత్మావా" ఇత్యనేన సిద్ధం, దీక్షితాః పంచరాత్రిణః. దత్తపుత్రాస్తత్సదృశాః, దీక్షాయా యథా పంచరాత్ర తంత్రాఽసాధారణ్యం తథాస్మాభిః ప్రాగేవ ప్రపంచితం ద్రష్టవ్యం. అథ వాఽయం పారిభాషికో

అగు మమ్ములను విడచి నీవు మాయందు కంటె యధికముగ బ్రమ జెందుట కా విఖనమునియందుగల విశేషమెద్దియో నీకట్టి ప్రేమగలుగుట యందెద్ది హేతువగునో సంక్షేపముగ నింకొకమారు జెప్పగోరుచున్నాము.

భగవానువాచ. ఆత్మావై పుత్రనామా సీద్విష్ణోర్విశ్వకుటుంబినః 5
( విశేషఖననాద్యోయం విఖనా మునిసత్తమః.)
వైఖానసా ఔరసాశ్చ దత్తపుత్రాశ్చ దీక్షితాః

వ్యవహారః. దీక్షా తావత్ పంచసంస్కారరూపా, తత్రాऽవ్యయం సంకేతితశ్శబ్దోజ్ఞేయః. యత్తూక్తం కేన చిదసహిష్ణునా శాస్త్రమర్యాదావాసనాऽనభిజ్ఞేన పండితంమన్యేన "కస్య చిత్పురుషస్య స్వకీయానా మౌరసానాం కదా చిత్సతాం పుత్రాణాంవిలయ ఏవ దత్తపుత్రాऽపేక్షా తత్స్వీకారాऽవసరశ్చేతి, నిర్గుణేషు వా స్వకీయేషు పుత్రేషు గుణవది తరపుత్ర సంపాదనాయ దత్తపుత్రాऽపేక్షా తత్స్వీకారాऽవసరశ్చేతి, తదేతాదృశానాం" వైఖానసా ఔరసా "ఇత్యాదీనాం వచనానాం బాధితాऽర్థత్వేనాऽనాऽప్తతా యద్వా సర్వేషామౌరసపుత్ర పరిభాషితానాం వైఖానసానాం విలయశ్శక్యశంకః పంచరాత్రిణాం దత్తపుత్రాణాం భగవతా స్వీకార ప్రసంగ ఇత్యాది తత్తుచ్ఛం సాదృశ్యార్థ స్యాऽస్మత్ప్రతిపాదితస్య సార్వజనీనత్వేన సమీచీనతయోరుపత్తేః కించపుత్రహీనస్య తత్త్వేన దత్తపుత్రేऽపి పుత్రవత ఔరసపుత్రాऽపేక్షాయాऽధికత్వే నాऽదరస్య సంభావ్యమానత్వేऽపి న తత్ర్పేమసోపాధికం సత్పరమార్థేనే తరదితి వర్తితుం ప్రభవతీతి బోధ్యం. న చ విఖనస ఆదరాతిశయ కారణస్య దేవైః పరిపృచ్ఛ్యమానే కిమనేన వైఖానసానా మౌరసత్వకథనాదినా సంగతిరితి వాచ్యం. స్వసుతవిఖనః ప్రణీత విఖనస్సూత్రానుష్ఠాతౄణాం తావతా సంబంధేనైతాదృశ మానార్హత్వే కిము వక్తవ్యం సాక్షాద్భగవతి స్వౌరస్ణే విఖనసీత్యర్థస్య బిబోధయిషితత్వాత్. "కించ" పంచరాత్రస్య కృత్స్నస్యవక్తా నారాయణస్స్వయమితి ప్రశస్యమానస్య పంచరాత్రస్య "వైఖానసం పంచరాత్రం విష్ణోర్నేత్ర ద్వయంస్మృత" మితి సముపఠితస్యచాऽపి సన్నిధానే తచ్ఛాస్త్రనిష్ఠజనాపేక్షయా వైఖానస శాస్త్రనుష్ఠాతృషు వైలక్షణ్య సంపాదనేన పరంపరయా విఖనస ఆదరాతిశయస్య సిసాధయి షితత్వాచ్చ. కోవాऽనున్మతః ప్రలద్వైఖానసాస్సర్వే వృత్తా వర్తమానా వర్తిష్యమాణాభగవత ఉరసైవ సంజాతా ఇతి యదిదం ప్రత్యక్షవిరుద్ధం, యద్వా పంచరాత్రిణ స్స్వీకృతాః పుత్రాస్స్వపితౄణామానృణ్య సంపాదనాయేతి యదిదమసంభవి, తతో భగవాన్హి స్వయం గర్భం ధృత్వా దశమే మాసే ప్రసూతే తథా వంశకర్తారం కసాపి పరస్య పుత్రం దత్త హోమాది నిర్వర్త్య స్వీకురుతే, కోవాతత్రాऽऽచార్యో దత్తహోమాదినిర్వర్త్తయితా చెత్యాది కు తర్కాణామవక్షరకుక్షి ప్రలాపత్వేన తత్సమాహితా వుదాసామహే, శాస్త్రజ్ఞా హి బ్రువతే సర్వేऽపి

మహాపురుషుల నామకీర్తనమును వినుటయందును సంబుద్ధిచే

దేవాదయశ్చ మద్భక్తా దాసాశ్చాఽన్యే మహీతలే. 6

భగవతః పుత్రా ఇతి. "త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా, పితాఽసి లోకస్య చరాచరస్య, "మాతా పితా యువతయస్తనయా విభూతి " రిత్యాది. యథాజీవకోట్యను ప్రవిష్టేషు వ్యక్తివిశేషేషు బ్రహ్మరుద్రాది రూపేణ తరతమభావ ఆధికారిక స్సాంసారికో వా తథా కర్మవిశేషభేదేన " బ్రాహ్మంయోనిశతం ప్రా " ప్యేత్యాదిపూర్వాధ్యాయోక్తవత్ పుత్ర దత్తపుత్ర రూపం తారతమ్యం క్రమాద్వైఖానస వైఖానసేతరపంచరాత్రిషు సుతరాముపపద్యతే, కించోచ్యతే సమనన్తరమేవ దేవాదయో ఇతి. ఇయంయోజనా, యే మద్భక్తామయి భక్తిభాజః, దేవాదయో బ్రహ్మేశాదయః, అన్యే చ యే భూలోకవాసినో మర్త్యాః, మహీతల ఇతి లోకాన్తరాణాముపలక్షణం. అత్రయే వైఖానసకులేన జాతాః పంచ రాత్ర శాస్త్రేణ వానాఽపి దీక్షితాస్తే దాసా దాససదృశాః. అస్యాస్స్మృతీ యకక్ష్యాయా ఉపన్యాసోఽ ప్యస్మదుక్తార్థ ఏవ స్వరసతస్సంగచ్ఛ తే విష్ణు భక్తానాం త్రేధా విభాగ ఇతి. నాఽవిస్రంభణీయమేతద్విధేషు వచనేషు యత్ర్సాప్యయః పఠ్యన్తే " యం సాధు నినీషతి, సాధు కర్మ కారయతి, అసాధు నినీషతి. అసాధు కర్మ కారయతి " "యమేవైషవృణుతే తేన లభ్యః, యోమేభక్తస్స మే ప్రియః" " నక్షమామి కదా చ " నేత్యాది.

వ్యాజస్తుతి చేయబడుచున్నదని భావము.) ఓ దేవా ! శ్రుతిస్మృతి పురాణములనన్నిటిని సాంగముగ నుపన్యసించి యుపదేశించిన నీ కళ్యాణమూర్తి స్వయముగ మా కట్టెదుట బ్రసన్నమై తత్త్వప్రసూతియగు వాక్కుచే మమ్ములశాసింప నవకాశము గలిగియుండ నోమహాత్మా! క్లిష్టార్థంబులను బహ్వర్థంబులును దటస్థార్థంబులునగు శ్రుత్యాది వచనము లందు మాకు ప్రామాణ్య మెక్కుడుగ నెట్లుదయింపగలదు. నీవు తత్త్వమని దెలియపరచిన యంశమునే మేము శ్రుతిశిరోలలామముగ నెంచి యాదిరించుచున్నాము. (తదను గుణంబుగ నర్థాంతర యోజనాసహంబులగు వానిని సంస్కరించి కొనుచున్నా మనుట.) పూర్వాధ్యాయోదితమగు నీ ప్రసంగమున కంతకును కొలికి పూసవంటి యొక తీర్మానము సంక్షేపముగ మా కుపదేశింపుమని భావము. 4. అంత నా పలుకులను విని భగనానుడును జగత్కుటుంబి యునగు శ్రీ మహావిష్ణుండును, ఓ దేవతలారా ! నా యొక్క యాత్మయే (నేనే) విశేషముగ వేదాన్తతత్త్వ మీమాంసయను ఖననము అనగా చింతనము చే 'విఖనసు' డనుపేరిట నొక్క దివ్యస్వరూప మావిర్భవించెనని చెప్పెను. ఇచ్చట

న హ్యేతావతా భగవత స్సర్వచేతనసామ్య భంగాపత్తిః. "స్వయం క్రీడన్ క్రీడయన్ క్రీడాన్తరమను ప్రావిశ " దిత్యాది ప్రమాణానాం జాగురూకత్వాత్. ప్రకృతమను సరామః దేవాదయస్త్విత్యపి పాఠః, తత్రాऽపి తుస్సముచ్చయార్థకః. 6. పుత్రత్వావచ్ఛిన్నేऽధి కారిభేదేన భావభేదముపపాద్య సంప్రతి పితృప్రతి యోగికం తత్తత్పుత్ర చరితమాహ పుత్రాలోకే పుత్రా ఔరసా ఏవ పితుః పూజామపచితిం స్వభావాన్ని. సర్గ ప్రేమ భాజా హృదయేన సంప్రకుర్వతే నిర్వర్తయన్తి. దత్తాస్తురిక్త బద్ధ ప్రేమ్ణైవ హృదయేనేతివివేకః. అస్తువా పితర్యన్యాదృశం ప్రేమ నతథా పుత్ర ఇతి ప్రీత్యా అనుభయ విశ్రాన్తత్వే విభక్తశక్త్యాస్తస్యా అవ్యార్తకత్వ మత్రాతృప్తిబీజం, పిత్రోరితి మాతాపిత్రోరిత్యర్థః, " మాతా పితరౌ పితరా " వితి కోశః, " పితా మాత్రేత్యేశేషః త్వామేహహూః కతిచిదపరే త్వత్ప్రియం లోకనాధంకిం తైరన్తః కలహమవినైః కించి దుత్తీర్య మగ్నైః త్వత్సం ప్రీత్యై విహరతి హరౌ సమ్ముఖీనాం శ్రుతీనాం భావారూఢౌ భగవతి యువాం దైవతం దంపతీన " ఇతి వేంకట

'విష్ణోః' 'విశ్వకుటుంబినః' అనుపదములచే నొక విలక్షణమగు నర్థము బోధింప బడుచున్నది. విశ్వవ్యాపన శీలుడను నర్థమిచ్చు విష్ణు శబ్దముచే దాను విశ్వవ్యాపి గనుక జగమంతయు దానెరుగని యంశములేదు గనుక యప్రతిపత్తి విప్రతిపత్త్యన్యథా ప్రతిపత్తులు గలుగనేరవనియు, జగత్కుటుంబి యను పదముచే తనకు సమస్తప్రాణికోటియందును పుత్ర భావంబును వారల నపేక్షించి తనయందు పితృభావంబును వహించి యుండుటచే పక్షపాతశంకావకాశంబు లేదనియు నిట్టి సంపన్నుడగు గృహస్థునకే ప్రమేయమందుగాని యనృతము జెప్ప నవకాశము లేదనియు తెల్లమగుచున్నది. 5. మరియు వైఖానసు లందురును నా యౌరస పుత్రులు గను పంచరాత్రులు దత్తపుత్రులుగను వైఖానస కులోద్భవులును పంచరాత్ర శాస్త్ర దీక్షితులును కానట్టి యితరులగు దేవతలాది భూలోకమందు గల నాభక్తులందరును దాసులుగను నాచే యనుగ్రహింపబడుచున్నారు. (ఇచ్చట కొందరసూయాంధులును శాస్త్ర మర్యాదా గంధ శూన్యులునగు పండితంమన్యులు కుశంకలు జేయుదురు. పుత్రులు దత్తపుత్రులు అను రెండు పదములకు యథాశ్రుతార్థమును గల్పించి దానపదంబు దగిలిన ద్వితీయార్థమును విడచివేసి విపరీతార్థము ననువుపరచి లోకములో పుత్రవంతుడగు నొక్క పురుషునకు వేరొకని పుత్రుని స్వీకారము జేసికొన దటస్థముగా జాలదనియు నట్లే వైఖానసులచే భగవానుడు పుత్రవంతుడ యినపుడు పంచరాత్రలను దత్తపుత్రులతోడి

